







# స్టార్లు.. ఫేవ'రేట్' కార్లు

వెండితెరపై మన 'స్టార్లు' రీలుకో కారులో తిరిగినా తెరవెనుక వారికంటూ ఫేవరెట్ కారొకటుంటుంది. పార్టీలకు, ఫంక్షన్లకు స్వంత కార్లలోనే దర్జా ఒలకబోస్తూ హాజరవుతుంటారు. అప్పుడప్పుడు వారే డ్రైవ్ చేస్తుంటారు కూడా (సల్మాన్‌లాంటి వారు యాక్సిడెంట్లు కూడా చేస్తారనుకోండి అది వేరే విషయం). ఆయా సందర్భాల్లో బాలీవుడ్ స్టార్లు తమ లగ్జరీ కార్లలో కెమెరాలకు ఇలా చిక్కారు. కొందరికి రోల్స్‌రాయిస్ ఇష్టమైతే మరికొందరికి ఆడి, బెంజ్, జాగ్వర్, ఫెరారీ, బిఎండబ్ల్యూవంటి హైఎండ్ కార్లున్నాయి. అవన్నీ కూడా వారి పారితోషికాల్లాగే కోట్ల రూపాయల ఖరీదు చేస్తాయని వేరే చెప్పాలా!















## ఇండెక్స్






# ఆదివారం ఆంధ్రజ్యోతి

27 నవంబర్ 2016


## ఇన్‌బాక్స్

### మేలుకొలిపే కవర్‌స్టోరీ

ఈ వారం కవర్‌స్టోరీ 'ఆన్‌లైన్ రమ్మీ... ఆడుతున్నారు జోరుగా' సందర్భోచితంగా ఉంది. ఆన్‌లైన్‌లో ఏ వెబ్‌సైట్ ఓపెన్ చేసినా ఇబ్బడిముబ్బడిగా రమ్మీ యాడ్స్ కనబడుతున్నాయి ఈ మధ్య. స్మార్ట్ ఫోన్లలో అయితే చెప్పనక్కర్లేదు. ప్లేస్టోర్‌లో ఉండే గేమ్స్‌లో కూడా చాలావరకు రమ్మీ ఆటలే. మనకు తెలియకుండానే మన చుట్టూ పేకాట పాపారాయుళ్లు ఎక్కువయ్యారు. ఆన్‌లైన్‌లో రమ్మీతో పాటు ఆ ఆట వల్ల కలిగే నష్టాల గురించి కూడా బాగా చెప్పారు. పేకాట ఉచ్చులో పడకుండా కొందరినైనా ఈ కవర్‌స్టోరీ మేలుకొలుపుతుందని ఆశిస్తున్నాం.

**- నీలిమ సబ్బిశెట్టి**, రాజానగరం

### వాట్ ఈజ్ 'స్పేస్'?

ఈ వారం కథ 'స్పేస్' చాలా బాగుంది. వాట్సాప్, ఫేస్‌బుక్ అంటూ ఫోన్లకి అతుక్కుపోయి, సమాజానికి, కుటుంబానికి దూరంగా కాల్పనిక ప్రపంచంలోకి వెళ్లిపోతున్న యువతకి, అసలైన భారతీయ కుటుంబ వాతావరణానికి మధ్య 'స్పేస్'ను చూపించింది ఈ కథ. టెక్నాలజీ బాగా అభివృద్ధి చెంది ఎక్కడో అమెరికాలో ఉన్న వారితో కూడా రోజూ మాట్లాడేస్తున్నాం. కాని పక్కనే ఉన్న అమ్మానాన్నలతో నిమిషం సేపు మాట్లాడటం కూడా మరిచిపోతున్నాం. ఏదైనా శ్రుతి మించనంత వరకే బాగుంటుందనే విషయం మొబైల్ భూతం భీకర రూపం పొందాక కాని అర్థం కాలేదు. మంచి సందేశాన్ని అందించిన రచయితకు అభినందనలు.

**- శివ**, పొద్దుటూరు

•••

మనిషి మనిషికి మధ్య దూరం ఎంతుండాలి? భర్తకు భార్య దగ్గర, భార్యకు భర్త దగ్గర కూడా పర్సనల్ విషయాలు ఉంటే వారి మధ్య ఉన్న బంధానికి విలువేముంటుంది? రెండు తరాల మధ్య ఉన్న అనుబంధాల అంతరాన్ని అందంగా ఆవిష్కరించారు రచయిత. మేనత్త పాత్ర కోరుకున్న స్వేచ్ఛ ప్రతి మనిషికీ అవసరం. నిత్య పాత్ర స్వేచ్ఛ అనుకునే స్పేస్ తన చుట్టూ తాను ఒక కంచెను నిర్మించుకోవడం లాంటిది. ఆ 'స్పేస్' కొన్నిసార్లు జీవితాన్నే తారుమారు చేసి ఒంటరిని కూడా చేస్తుంది. 'ఐ నీడ్ సమ్ స్పేస్' అనే మాట అనే ముందు స్వేచ్ఛకు అసలైన అర్థం ఏమిటనేది మన ముందు తరాల నుంచి తెలుసుకుంటే రోజురోజుకీ పెరిగిపోతున్న విడాకుల సమస్యలు కాని కుటుంబ కలహాలు కాని ఉండవేమో!

**- వనజ**, వరంగల్

### గ్రేట్ ట్రావెల్

ఈ వారం ట్రావెలోకం విశేషాలు ఎంతో ఆకట్టుకున్నాయి. చిత్రంగా మొదలుపెట్టి అద్భుతంగా నడిపించి 'ఏడు సముద్రాలు దాటి వచ్చామ'నే ఆశ్చర్యం గొలిపే సమాధానంతో వ్యాసాన్ని ముగించారు రచయిత. 'మినారో'ల చరిత్ర గ్రంథస్థం కాకపోవడం ఆశ్చర్యం కలిగించింది. కొండకోనల్లో ఇలా ఇంకెన్ని జాతులు, తెగలు మనకు తెలియకుండా మనుగడ సాగిస్తున్నాయో కదా! తామూ ఆర్యులమని చెప్పుకునే ఈ తెగకు ప్రపంచీకరణ తెగులు పట్టే ప్రమాదం లేకపోలేదు.

**- ప్రశాంతి**, ఖమ్మం

### అందంగా ఉన్నాయి

'గోడ శుభలేఖలు' వ్యాసం చాలా బాగుంది. గోడల మీద కూడా శుభలేఖలు చిత్రీకరిస్తున్నారని తెలిసి ఆశ్చర్యమేసింది. పెళ్లికి లక్షలకు లక్షలు ఖర్చు చేయలేని వారికి ఈ శుభలేఖల ఉపాయం చాలా ఉపయోగ పడుతుంది. టెంట్‌హౌస్, బ్యాండ్, క్యాటరింగ్ తదితర వ్యాపారస్థులకు కూడా ఈ గోడ శుభలేఖలు ఎంతో మేలుచేస్తాయి. 50 ఏళ్ల కిందటి ఈ శుభలేఖల ఉపాయం ఒక ఆచారంగా మారి ఇంకా గోడలపై కనిపిస్తుండడం సంతోషించాల్సిన విషయమే.

**- కృష్ణబాబు**, ఈమెయిల్

### 'వందేళ్ల బొమ్మ' బాగుంది

వెంట్రిలాక్విజం గురించి తెలుపుతూ ఇచ్చిన వ్యాసం బాగుంది. మన దేశంలో అంతగా పట్టించుకోకపోయినా ప్రపంచవ్యాప్తంగా ఎంతో క్రేజ్ ఉంది ఈ కళకు. అటువంటి కళను భారతీయులకు పరిచయం చేసిన పద్యే నిజంగా అభినందనీయుడు. ఆయన వారసత్వాన్ని తన కుమారుడు, మనవడు కొనసాగిస్తుండడం హర్షించదగ్గ విషయం.

**- సునీత**, సిరిసిల్ల

'ఆదివారం అనుబంధం'పై మీ అభిప్రాయాలను శుక్రవారంలోగా అందేలా పంపగలరు. ఆలస్యంగా అందిన ఉత్తరాలు ప్రచురించడం సాధ్యపడదని మనవి. sunday.aj@gmail.com కి మీ ఉత్తరాల్ని మెయిల్ చేయవచ్చు.

# అ'దృశ్య' ఆర్టిస్టు

మనిషిని ఊసరవెల్లిలా, అదృశ్యశక్తిలా తన బొమ్మల్లో చూపడమంటే బీజింగ్‌కు చెందిన 43 ఏళ్ల చిత్రకారుడు లియూ బొలిన్‌కు అమితమైన ఇష్టం. సూపర్‌మార్కెట్లలో ఫుడ్‌స్టాండ్స్ నుంచి గోడమీది పెయింటింగ్స్ దాకా మనిషిని విభిన్నంగా చూపడంలో ఆయనదొక స్టయిల్. ఇటీవల న్యూయార్క్‌లో 'ఆర్ట్ హాకర్' పేరిట బొలిన్ ఏర్పాటు చేసిన సోలో ఎగ్జిబిషన్ కళాప్రియులను విస్మయానికి గురిచేసింది. ఆయన ప్రతీ బొమ్మలో మనిషి ముఖం అదృశ్యంగానో, అస్పష్టంగానో కనిపిస్తుంది. ఉదాహరణకు తీగల కింద మనిషి ముఖాలు అనేక భావాలను పలికిస్తే, గోడ ముందు ఉన్న మనిషి గోడలో కలిసిపోయినట్టుగా కనిపిస్తాడు. చివరికి సెల్‌ఫోన్ చార్జర్ స్టాండ్ కూడా ఆయన ఆర్ట్‌లోని ప్రత్యేకతను ఇట్టే పట్టిస్తుంది.

అవీ ఇవీ

# సందడి షురూ...

ప్రపంచవ్యాప్తంగా క్రిస్మస్ సందడి అప్పుడే మొదలైంది. క్రిస్మస్‌తాతలు, క్రిస్మస్ చెట్లు, కేకులు, బెలూన్లు, బొమ్మలు, క్యాప్‌లు, క్యాండిల్స్... ఇలా మార్కెట్‌ను ముంచెత్తేందుకు సర్వం సిద్ధమవుతున్నాయి. ఫ్యాక్టరీలు రాత్రింబవళ్లు వాటి తయారీలో బిజీగా ఉన్నాయి. క్రిస్మస్ డెకరేషన్ ఐటెమ్స్, టాయ్స్ తయారీలో రష్యాలోని సైబేరియన్ ప్రాంతంలో ఉన్న 'బిర్యూసింకా' బొమ్మల ఫ్యాక్టరీకి 74 ఏళ్ల అనుభవం ఉంది. ప్రతీ యేడాది క్రిస్మస్‌కు ఈ ఫ్యాక్టరీలో కోట్లాది రూపాయల బొమ్మలు, డెకరేషన్ ఐటెమ్స్ తయారై ప్రపంచవ్యాప్తంగా రవాణా అవుతాయి. రాబోయే క్రిస్మస్ సందర్భంగా 'బిర్యూసింకా'లో అందంగా ముస్తాబవుతున్న శాంతాక్లాజ్ బొమ్మలివి.












## పేరడీ

('కానిస్టేబుల్ కూతురు' చిత్రంలోని
'వెన్నెల కేల నాపై కోపం' పాటకు)

**ఇ**డ్లీ ఏలా సాంబారు కోసం తహతహలాడినది?
ఈ పొంగలికేలా పచ్చడి తోనే
పొందిక కుదిరినది?
గారెలు ఏలా అల్లం కారం అంతగా మరిగినవి?
ఈ రోటీ కేలా కుర్మాతోనే కూరిమి కుదిరినది? /ఇడ్లీ ఏలా/

ఊరించు పూరి ఉప్పొంగె చూడు
మురిసిన దెందులకో?



ఆ ఘుమ ఘుమలాడె ఆలుకూరతో
పొందును కోరుటకే
హోటలు లోన సెలవు దినాన సీటులు కరువైనా
నే ఓరిమితోన కోరిన చోటే
చేరనా లేటైనా ... /ఇడ్లీ ఏలా/

కరకరలాడె కారపు దోసెను
కొరుకుటె హాయి కదా ..
నా కోరిక తీరా, ఫ్యామిలీతోనే
మేయుటె మేలు కదా! /ఇడ్లీ ఏలా/

**- అంబర్ఖాన ధనంజయ, 94907 29147**

## ద్వంద్వ నీతి



**ఒం**టరిగా రోడ్ మీదకి వెళ్లిన మగాడు ప్రతి అమ్మాయి వంక చూస్తాడు. అదే తన చెల్లితోనో, చెలితోనో రోడ్డుమీదకి వెళ్లినపుడు తమని ఎవడు చూస్తున్నాడో అని చూస్తాడు!

## హెచ్చరిక




'**వా**ట్సాప్‌లో రిపీట్ పోస్టులు చేసేవారికి వచ్చే జన్మలో కూడా ఇప్పుడున్న భార్యే దొరుకుతుంది. పదే పదే రిపీట్ చేస్తే అత్తమామలూ వాళ్లే దొరుకుతారు.'

## క్యా డైలాగ్ హై



- ఆడపిల్లను పుట్టినప్పటినుంచి మహాలక్ష్మిలా పెంచి పాతికేళ్లు రాగానే పరాయింటికి పనిమనిషిలా పంపడానికి సిద్ధపడతాం.
- నేను పోయినప్పుడు నా చుట్టూ నలుగురు లేకపోతే నా తప్పు కావచ్చేమో కాని, నేను పుట్టినప్పుడు నా చుట్టూ నలుగురు లేకపోతే నా తప్పు ఎలా అవుతుంది?
- మనం ప్రేమించేవారికి మన వల్ల చెడు జరుగుతుందని తెలిసినప్పుడు వాళ్లను వదిలేయడం కూడా ప్రేమే!

- చిత్రం : **సోలో**



**గణితసూత్రాలు తెలిసిన వాడికి గణిత సమస్యలు పరిష్కరించడం ఎంత సులువో... సినీ పాట వ్యాకరణాన్ని ఔపోసన పట్టిన అనంత శ్రీరామ్‌కి ఏ రకమైన సందర్భానికైనా... పాట అల్లడం అంతే సులభం. అందుకే తక్కువ కాలంలోనే ఆయన కలం నుంచి ఎన్నో వైవిధ్యభరితమైన పాటలు జాలువారాయి. ఈ మధ్య కాలంలో 'సర్దార్ గబ్బర్‌సింగ్' సినిమాలో సూపర్ హిట్టైన 'తోబా తోబా' పాట గురించి ఆయన మనతో పంచుకున్న ముచ్చట్లే ఈవారం 'నా పాట'లో...**



# హే తోబా తోబా...

గేయ రచయితగా ఏదో ఒక రకమైన పాటలకే కాక... ఏ పాటకైనా అనంత శ్రీరామ్ న్యాయం చేయగలడు అని అందరూ అనుకోవాలన్నదే నా తపన. ఆ కారణంగానే వైవిధ్యభరితమైన పాటలు రాయడానికి ఎదురు చూస్తుంటాను. 'సర్దార్ గబ్బర్‌సింగ్'లో 'తోబ తోబా' పాట అలాంటి ఒక అవకాశం. ఈ పాటని చాలా తక్కువ సమయంలో రాయాల్సి వచ్చింది...

ఎందుకంటే అప్పటికే "సెట్ రెడీగా ఉంది. అందరివీ డేట్లు కుదిరాయి. మ్యూజిక్ డైరెక్టర్ దేవిశ్రీ ప్రసాద్ ట్యూన్ ఇచ్చేశారు. మీరు రేపటికల్లా పాట ఇవ్వగలరా" అని అడిగారు డైరెక్టర్. నేను ఇస్తాను అని చెప్పిన తర్వాత సిట్యుయేషన్ చెప్పారు. 'విలన్ అండదండలున్న రౌడీ గ్యాంగ్ పాఠశాలలో తిష్టవేసి అసాంఘిక కార్యకలాపాలకు పాల్పడుతుంటుంది. హీరో దృష్టికి ఆ విషయం వస్తుంది. వెంటనే హీరో ఆవేశంగా వెళ్లి ఫైట్ చేసి వాళ్లను స్కూలు నుంచి ఖాళీ చేయించేయొచ్చు. అప్పుడు పాట అవసరం ఉండదు. కానీ సినిమాలో హీరో క్యారెక్టరైజేషన్ ప్రకారం ఆ సన్నివేశాన్ని అలా తీయడం కుదరదు. హీరో రౌడీ గ్యాంగ్‌కి సపోర్ట్ చేస్తున్నట్టుగానే ఉండి, చివర్లో వాళ్లే తప్పు ఒప్పుకునేలా చేయాలి... పాట నడక అలా సాగాలి" అని చెప్పారు డైరెక్టర్.

పాట రాయడం మొదలు పెట్టినప్పుడే అర్థమైంది ఈ పాటకు విపరీతమైన హైప్ వస్తుందని. 'ఆ అంటే అమలాపురం' నుంచి దేవిశ్రీ ప్రసాద్ మ్యూజిక్‌తో వచ్చే ఐటెం సాంగ్ అంటే... జనాల్లో విపరీతమైన క్రేజ్ ఏర్పడింది. ట్యూన్ క్యాచీగా ఉంది కాబట్టి ప్రతివాళ్లూ హమ్ చేస్తారని అర్థమైంది. అందుకే లిరిక్స్ కూడా క్యాచీగా ఉండేలా శ్రద్ధ తీసుకున్నాను. సాధారణంగా నేను ట్యూన్ తీసుకున్న తర్వాత గతంలో అలాంటి సిట్యుయేషన్‌లో వచ్చిన పాత పాటల్ని వింటాను. నా లిరిక్స్ ఆ పాటలకు భిన్నంగా ఉండేలా జాగ్రత్త పడతాను. ఇక్కడ దేవిశ్రీ గారి గురించి మీకో విషయం చెప్పాలి. ఒక్కోసారి దేవిశ్రీ గారు నేను రాసిన ఫస్ట్ వెర్షనే ఓకే చేసేస్తారు. ఒక్కోసారి తనకు కావాలనుకున్నది రాలేదనుకున్నపుడు ఇరవై వెర్షన్లు రాయించడానికైనా వెనుకాడరు. ఫస్ట్ వెర్షన్‌కే ఓకే చేయించుకోవాలనే పట్టుదలతో పాట రాయడం ప్రారంభించాను.

నిజానికి 'తోబా తోబా' పాట నేపథ్యం ప్రత్యేకమైనది. దీన్ని ఐటెమ్‌సాంగ్ అనడం కంటే స్పెషల్ సాంగ్ అనడం కరెక్ట్. స్కూల్లో రౌడీ గ్యాంగ్ చేసే పనులన్నీ పాటలో రావాలి. ముందుగా వాటిని ఓ లిస్టులా రాసుకున్నాను. ఈ పనులు ఎక్కడ జరిగితే జనం పాజిటివ్‌గా రిసీవ్ చేసుకుంటారు... అని ప్రశ్న వేసుకున్నప్పుడు స్వర్గలోకం నేపథ్యంగా కుదిరింది. అలా ఓ క్లారిటీ వచ్చిన తర్వాత పాట చకచకా రాసుకుంటూ వెళ్లిపోయాను. 'హే తోబా తోబా' అని పాట స్టార్ట్ చేశాను. 'తోబా' అనే పదం పర్షియన్ నుంచి ఉర్దూలోకి వచ్చిన పదం. దీనికి తెలుగులో 'ఓరి దేవుడో' అని అర్థం చెప్పుకోవచ్చు.

**హే తోబా తోబా తోబా తోబా**
**తోడుగుంది దిల్లురూబా**
**ఊపుగా తనొక్క స్టెప్పేస్తే**
**ఊరికే ఊరంత తిడతారే**

రౌడీలు అమ్మాయిలతో డ్యాన్సులు చేయించడం మామూలే. కానీ ఆ పనిని ఎవరూ హర్షించరు. తిడతారు కూడా. మరి దీన్ని ఎలా సమర్థించాలి? స్వర్గలోకంలో వినోదం కోసం అప్సరసలు నాట్యం చేస్తే తప్పులేదు గానీ... ఈ అమ్మాయిలు డ్యాన్సు చేయడం తప్పా? వీళ్లకో రూల్, వాళ్లకో రూల్ పెట్టడం తప్పు కాదా? అని కథానాయకుడు ప్రశ్నించేట్టు లిరిక్స్ రాశాను. దాంతో రౌడీ గ్యాంగ్ హుషారుగా కథానాయకుడికి వంత పాడుతూ 'తప్పు తప్పే.. తప్పు తప్పే' అంటారు. మళ్లీ అమ్మాయి చేసే నాట్యానికి, అప్సరస చేసే నాట్యానికి పోలిక పెడుతూ 'దాన్ని నాట్యం అంటారు, దీన్ని మేళం అంటారు తప్పు కాదా?' అని రాశాను. 'మేళం' అంటే వేశ్యల ఆట అని అర్థముంది.

రౌడీ గ్యాంగ్ చేసే మరో పని తాగడం... ఇష్టమొచ్చినట్టు వాగడం. రెండో చరణంలో దాన్ని తీసుకున్నాను. యథావిధిగా కథానాయకుడు దాన్ని కూడా సమర్థించాలి. అందుకే -




**మత్తులో మజాలు చేస్తుంటే**
**కుళ్లుతో గింజేసుకుంటారే**
**స్వర్గ లోకంలో జనమంతా**
**సుర అనే సారాని ఏస్తారే**

అని రాశాను. దాని తర్వాత వాళ్లకో రూల్ వీళ్లకో రూల్ తప్పు కాదా అనడం, దానికి విలన్ గ్యాంగ్ తప్పు తప్పే అనడం మామూలే. మగువ, మందు తర్వాత జూదం దగ్గరకొచ్చాను.

**తీసి పారేయొద్దు జూదాన్ని**
**ధర్మరాజంతోడు ఆడాడె**

అంటూ పేకాటను సమర్థించే పాదాలు రాశాను. ఇలా చివరి వరకూ రౌడీ గ్యాంగును సమర్థించిన హీరో... అంతా అయిపోయిన తర్వాత 'కాని చుక్కైనా ముక్కైనా ఇక్కడేస్తే (స్కూల్లో) తప్పు కాదా?' అని ప్రశ్నిస్తాడు. రౌడీ గ్యాంగు పాత పద్ధతిలోనే 'తప్పు తప్పే పెద్ద తప్పే... తప్పు తప్పే శుద్ధ తప్పే' అని తమకు తెలియకుండానే తప్పు ఒప్పుకోవడం కొసమెరుపు. పాట పూర్తయిన తర్వాత పవన్ కళ్యాణ్ గారికి పంపించాను. ఆయన పాట విని ఫోన్ చేసి... ఆఫీసుకు రమ్మన్నారు. నన్ను చూడగానే షేక్‌హ్యాండ్ ఇచ్చి లిరిక్స్ బాగున్నాయన్నారు. నేను వెళ్లిన కాసేపటికి దేవిశ్రీ గారు కూడా అక్కడకు వచ్చారు. ఆయనకీ లిరిక్స్ నచ్చడంతో రికార్డింగ్‌కి వెళ్లిపోయారు. మేం ఊహించినట్టుగానే పాట సూపర్ హిట్టైంది. నాక్కూడా చాలా ఫోన్లు వచ్చాయి. వచ్చే వారం మరో పాటతో కలుద్దాం.

- అనంత శ్రీరామ్
ananthasriramlyrics@gmail.com



# సజీవ విగ్రహం

చెన్నైలోని విజిపి గోల్డెన్ బీచ్ ఎంట్రన్స్ వద్దకు రాగానే పెద్ద తలపాగా, రాజుల కాలం నాటి వస్త్రధారణ, చేతిలో కర్రతో ద్వార పాలకుడిలా ఉన్న విగ్రహం ఒకటి కనిపిస్తుంది. నిజానికి అది విగ్రహం కాదు... జాగ్రత్తగా చూస్తే మనిషని అర్థమవుతుంది. అర్థమైన తర్వాత ఎవరెంతగా పలకరించాలని చూసినా ఆ మనిషి చలించడు. మూడు దశాబ్దాలకు పైగా లక్షలమందిని సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తుతున్న ఆ సజీవ విగ్రహం పేరు మహ్మద్ రఫీ.

మద్రాసు పట్టణం... చెన్నైగా మారింది. ముఖ్యమంత్రులు అనేకమంది మారారు. నగరం ఎంతగానో విస్తరించింది. వాటితో ఏమీ సంబంధం లేకుండా ఉన్న చోటే నిలబడి ప్రపంచాన్ని వీక్షిస్తున్న మౌన ప్రేక్షకుడు అతను. పొట్టకూటి కోసం 1982లో అక్కడ విగ్రహంలా నిలబడటం మొదలుపెట్టాడు మహ్మద్ రఫీ. ప్రారంభంలో సందర్శకులు తక్కువగా వచ్చినపుడు పది, 15 నిమిషాలు నిలుచుని, వాళ్లు వెళ్లిపోగానే కూర్చునేవాడట. తర్వాత టూరిస్టుల తాకిడి పెరిగేసరికి నిలుచునే సమయం నిమిషాలు దాటి గంటల్లోకి వెళ్లిపోయింది. ఒక్కోసారి నాలుగు గంటల పాటు కూడా విరామం లేకుండా నిలబడాల్సి వచ్చేది. అయినా అంతసేపూ విగ్రహంలా నిలబడి ఉండేవారాయన. ఇదంతా ఎలా సాధ్యం అంటే... "మనసును కంట్రోల్ చేసుకోవడం వల్లే" అంటారాయన.

కదలకుండా, కనురెప్ప మూయకుండా నిమిషం పాటు ఉండటమే కష్టం. అలాంటిది గంట దాకా కూడా రెప్ప మూయకుండా నిలబడ గలరు రఫీ. "మామూలుగా కనురెప్ప వేయకుండా ఎక్కువ సేపు ఉండటం సాధ్యం కాదు. కానీ నేను దాన్ని సవాల్‌గా తీసుకున్నాను. కళ్లు మండుతున్నా, కన్నీరు వస్తున్నా రెప్ప మూయకూడదని గట్టిగా సంకల్పించుకున్నా. అందుకే దాదాపు గంట వరకూ కనురెప్ప వేయకుండా ఉండగలుగు తున్నా. ఇపుడు నా కంటి సమీపంలో ఈగలు వాలినా నా రెప్ప మాత్రం మూతపడదు' అని చెప్పారు రఫీ. ఇలా విగ్రహంలా నిల్చునే సమయంలో రఫీకి చాలా పరీక్షలు ఎదురవుతాయి. కొంతమంది చక్కిలిగింతలు పెడతారు. మరికొంతమంది పొడుస్తారు. పగలబడి నవ్వాల్సిన జోకులు పేలుస్తారు. అయినా ఆయనలో కించిత్తైనా చలనం ఉండదు.

"ఒకసారి ఓ గమ్మత్తైన సంఘటన జరిగింది. ఓ విదేశీయుడు నా దగ్గరకు వచ్చి ముట్టుకుని చూశాడు. నాలో చలనం లేదు. కనురెప్ప వరకూ వేలిని తీసుకెళ్లాడు. అయినా కళ్లు మూయకపోయేసరికి అనుమానమొచ్చి... మనిషైతే శ్వాస ఆడాలి కదా అని ముక్కు దగ్గర వేలు పెట్టి చూశాడు. ఏం తెలియలేదు. ఇక నన్ను విగ్రహమే అని నిర్ధారించుకుని కెమెరాతో చిత్రించసాగాడు. కాసేపటికి గైడ్ వచ్చి... విగ్రహం కాదు మనిషే అని చెప్పాడు. కాదు అది విగ్రహం అని గైడ్‌తో గొడవపెట్టుకున్నాడు. చివరికి నేను కదిలి ఆయన దగ్గరకు వెళ్లేసరికి కెమెరాని అక్కడే వదిలి పరిగెత్తాడు. కాసేపటి తర్వాత తిరిగొచ్చి నన్ను తిట్టుకుంటూ కెమెరాని తీసుకెళ్లాడు' అంటూ ఆ రోజుల్ని జ్ఞాపకం చేసుకున్నారు.

ఇవేకాదు... కొన్నిసార్లు బాధాకరమైన సంఘటనలు కూడా ఎదురవుతాయట. తాగిన వాళ్లు వచ్చి అసభ్యంగా మాట్లాడతారట. మరికొంతమంది గిచ్చుతారట. సిగరెట్లతో చేతిపై కాల్చేవాళ్లు కూడా ఉంటారట. అయినా సాధ్యమైనంత వరకూ చలించరు రఫీ. ఒకసారి ఓ తాగుబోతు హఠాత్తుగా బ్లేడు తీసుకుని చేతులపై దాడి కూడా చేశాడట.

ఇలాంటి కొన్ని చేదు అనుభవాలు ఉన్నా... ఇంత నిబద్ధతతో ఎలా ఉండగలుగుతున్నారని ప్రశ్నిస్తే... "ఒకసారి కొంతమంది తెలుగువాళ్లు వచ్చి నన్ను బాగా పరికించి, వాళ్లల్లో వాళ్లు 'దేవుడు, దేవుడు' అనుకుంటూ నా పాదాలపై డబ్బులుంచారు. ఆ సంఘటన తర్వాత నాకు నా వృత్తిపై మరింత గౌరవం పెరిగింది. అదే నాకు స్ఫూర్తి అని చెప్పాలి" అన్నారు రఫీ. ఇప్పటికీ తెలుగువాళ్లు మద్రాసు వచ్చి ఇలా పాదాలపై డబ్బులు పెట్టి వెళుతుంటారట.

నిజానికి రఫీ పొట్టకూటి కోసం ఆ పని చేయడం మొదలుపెట్టినా... ఇప్పుడు మాత్రం అదొక్కటే కారణం కాదు. పొట్టకూటి కోసమే అయితే ఈసరికే ఆయన మరో పని వెదుక్కుని ఉండేవారు. కాని అలా విగ్రహంలా నిలబడటాన్ని ఓ పవిత్రమైన బాధ్యతగాచూస్తున్నారాయన. అందుకే దాదాపు ముప్ఫై నాలుగు సంవత్సరాలుగా సజీవ విగ్రహంలా నిలబడే ఉన్నారాయన. ■




# బొమ్మల్లో సైన్స్



● జి.కె. అనంత సురేష్

**సైన్సు విద్యార్థులు పాఠాలకు సంబంధించిన కొన్ని బొమ్మలు వేస్తారు. అంతమాత్రాన వారిని ఆర్టిస్టులు అనలేం. ఆర్టిస్టులు బొమ్మలు బాగా వేస్తారు కానీ సైన్స్‌తో వారికి అస్సలు పరిచయమే ఉండదు. అయితే బొమ్మల ద్వారా ఒక విషయాన్ని అందరికీ అర్థమయ్యేలా చెప్పొచ్చనే విషయం మనకు పాత రాతియుగం నాటి నుంచి తెలుసు. చరిత్ర మొత్తం బొమ్మల ద్వారానే బహిర్గతమయ్యింది. మన దేశంలో మధుబని, చేర్యాల్, సొంఝీ, వర్లీ వంటి పురాతన జానపద చిత్రకళాప్రక్రియలు చాలానే ఉన్నాయి. సంక్లిష్టమైన సైన్సు సంగతులను జానపద చిత్రకళతో మేళవించి కళాత్మక సైన్సు (ఆర్టిస్టిక్ సైన్స్)ను ఆవిష్కరించే ప్రయత్నం మన దేశంలో ఇటీవల IISCలో మొదలైంది. సైన్సు విద్యార్థులకు మానవీయ శాస్త్రాలతో (హ్యుమానిటీస్) కూడా పరిచయం ఉండాలని భారతీయ విజ్ఞాన సంస్థ (ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్స్) కొన్ని ప్రత్యేక పాఠ్యాంశాలను రూపొందించింది. భారతీయ జానపద చిత్రకళా రీతులను ఉపయోగిస్తూ విద్యార్థులు రూపొందించిన ప్రయోగాత్మక సైన్సు చిత్రాల పరిచయమే ఈ వారం కవర్‌స్టోరీ.**

**భో**పాల్ సమీపంలో ఉన్న భీంబెట్కా శిలాశ్రయాలు (rock shelters) పాతరాతి యుగంనాటివి. అంటే, లక్ష సంవత్సరాల క్రితంనాటివి. అయినప్పటికీ, అక్కడి రాళ్ళపై చిత్రింపబడ్డ చిత్రాలు ఈనాటికీ చెక్కుచెదరకుండా ఉన్నాయి. మైళ్ళతరబడి వ్యాపించివున్న ఈ శిలాశ్రయాల్లో యుగాలతరబడి మానవులు చిత్రించిన వర్ణ చిత్రాలు అవి. ఈ చిత్రాల్లో వివిధ జంతువుల, మనుషుల ఆకారాలు, అలంకరణలు, నృత్య దృశ్యాలు, వేట దృశ్యాలు, పనిముట్లు, మొదలైనవి కనిపిస్తాయి. వారు ఏ పదార్థాలతో, ఏ పనిముట్లను ఉపయోగించి ఆ అద్భుత రేఖాచిత్రాలను చిత్రీకరించారో అన్నది ఒక ప్రశ్నయితే, వారు ఏ ఉద్దేశ్యంతో చేశారన్నది ఇంకోటి. అవి వినోదానికా లేక విజ్ఞానానికా? కారణమేదైనా, అవి పురావస్తు శాస్త్రానికీ,

● పై బొమ్మ మట్టిలేకుండా మొక్కల్ని పెంచే పద్ధతిని తులసిమొక్కను ఉదాహరణగా తీసుకుని విశదీకరించిన చిత్రం. నీళ్లలోనే పోషకాలన్నిటినీ కలిపే ఈ పద్ధతిని హైడ్రోఫోనిక్స్ అంటారు. మధుబని కళారీతిలోని ఈ చిత్రానికి ఆర్టిస్టులు : శిఖర్ సక్సేనా, జితేంద్ర కుమార్, అతిశయ కుమార్ సాక్ష్యం, రాజ్ గౌతమ్.

చరిత్రకారులకీ ఎంతో ఉపకరిస్తున్నాయి. ఉదాహరణకి భీంబెట్కా చిత్రాల్లో కనిపించే గుర్రం మీది రౌతు బొమ్మలు, గుర్రాన్ని పోలిన బొమ్మలు, ఆర్యుల రాక పూర్వమే మన దేశంలో గుర్రాలుండేవేమో అన్న వాదానికి అవకాశం ఇస్తున్నాయి. అసలు ఆర్యుల దాడి నిజమేనా? అన్న ప్రశ్నను కూడా బలపరుస్తున్నాయి. ఒక జానపద చిత్రకళ శాస్త్ర పరిశోధనకి వీలు కల్పించడం ఆలోచించదగ్గ విషయం. కళకీ, శాస్త్రానికీ అంటే ఆర్ట్‌కి, సైన్స్‌కి, మధ్యనున్న అవినాభావ సంబంధాన్ని చర్చనీయాంశంగా చేసిన విషయమిది. చరిత్ర పూర్వ దశ నుంచి వర్తమానంలోకి, భీంబెట్కా నుంచి బెంగుళూరుకి తరలివచ్చి, ఆదిమానవుల చిత్రకళను కాకుండా, భారతీయ విజ్ఞాన సంస్థ (Indian Institute of Science - IISC) విద్యార్థులు ప్రస్తుతం వేస్తున్న జానపద విజ్ఞాన చిత్రాల గురించి చెప్పేందుకే ఈ వ్యాసం.

## కొత్త ప్రయోగానికి శ్రీకారం

సైన్స్ విద్యార్థులకు కూడా మానవీయ శాస్త్రాలతో, అంటే humanities తో పరిచయం ఉండాలన్న ఉద్దేశ్యంతో భారతీయ విజ్ఞానసంస్థ ప్రొఫెసర్ రాఘవేంద్ర గడక్కర్ ఆధ్వర్యంలో కొన్ని ప్రత్యేక పాఠ్యాంశాలను నిర్దేశించింది. అందులో కొన్ని వినూత్నమైనవి: 'చూసే పద్ధతులు' (Ways of Seeing), 'చేసే పద్ధతులు' (Ways of Doing), 'నేర్చుకొనే పద్ధతులు' (Ways of Learning) లాంటివి. ఆ కోవలోదే జానపద చిత్రకళలతో ఇండియా పటచిత్రణ (Mapping India through Folk Arts). పాఠ్యాంశంలో భాగంగా బోధకురాలు డా. బితస్తా దాస్ ఓ కొత్త ప్రయోగం చేశారు. అదేమిటంటే, భారతీయ జానపద చిత్రకళల పద్ధతిని ఉపయోగిస్తూ సైన్స్ సంబంధితమైన విషయాన్నొకదానిని చిత్రీకరించడం. సాధారణంగా సైన్స్ విద్యార్థులు చిత్రలేఖనం లాంటి వ్యాపకానికి ఆమడ దూరంలో ఉంటారు. అందులోనూ ఇక్కడ వారు అభ్యసించాల్సింది జానపద చిత్రకళ. మొదట్లో కంగారుపడ్డా ఆ తర్వాత ఆ పనిని చక్కగా నేర్చుకోవడమే కాదు తమకు తెలిసిన సైన్స్‌ను అందంగా అందులో ఇమడ్చగలిగారు కూడా. జానపద చిత్రకారులు వాడే పదార్థాలు వాడకపోయినా, కంప్యూటర్ గ్రాఫిక్స్ సాఫ్ట్‌వేర్‌ను ఉపయోగించి వాటి 'మౌలికత'ను తమ చిత్రాల్లోకి తీసుకురాగలిగారు. తాము ఎన్నుకొన్న ఒక జానపద చిత్రకళా పద్ధతిని క్షుణ్ణంగా పరిశీలించి, ఆకళింపు చేసుకొని, తామే ఎన్నుకొన్న ఒక సైన్స్ అంశాన్ని అందులో పొందుపరచగలిగారు.

## 'మధుబని'లో జన్యుసూత్రం

జన్యుశాస్త్రవేత్త గ్రెగర్ మెండెల్ విశిష్ట ప్రతిపత్తి సిద్ధాంతాన్ని



పెరుగుతున్న నగరీకరణను వర్లీ కళారీతిలో చూపిస్తున్న చిత్రం ఇది. పల్లెల నుంచి ప్రజలు తండోపతండాలుగా తరలి వెళుతుండడం వలన నగరం అంతకంతకూ విస్తరించడం కనిపిస్తుంది ఇందులో.
ఆర్టిస్టులు : దేబాదిత్య చటర్జీ, కిషలయ డే, సందీప్ సిన్హా, సయాక్ ఘోష్, తన్మయ్ పాల్.



(the law of segregation) మధుబని కళా రీతిలో ఒక గ్రూపు విద్యార్థులు చిత్రిస్తే, మానవ దేహంలోని ప్రతిరక్షణ (immunity) విధానాన్ని తెలంగాణ ప్రాంతపు చేర్యాల్ కళా రీతిలో మరో గ్రూపు, కొలాజ్ ఉజ్జాయింపు (Collatz Conjecture) అనే గణిత అంశాన్ని మధురలో ప్రచారంలో ఉన్న సాంఝీ కళా రీతిలో ఇంకో గ్రూపు... ఇలా పలు రీతులలో పలువురు విద్యార్థులు చిత్రించారు. ఒక్కో చిత్రంలో ఆయా చిత్రకళ గుణాన్ని ఎంత బాగా చూపారో సైన్స్ అంశాన్ని కూడా అంత బాగా ఇమిడ్చారు.



ఆర్టిస్టులు : ప్రీతీష్ పాటిల్, రైన్ సమజ్‌దార్, సహనా డి రావు, శశాంక్ హెచ్.ఆర్.

మధుబని చిత్రంలో, ఆ కళకు సంబంధించిన వలయాకారాలు, తామర పూలు, మీనులు, తాబేళ్లు మొదలైనవి తళతళ మెరిసే కాంతులలో ఉండడమే కాకుండా, జన్యు సూత్రం కూడా స్పష్టంగానే కనిపిస్తున్నది. జన్యువుల నుంచి మనకు సంక్రమించే ప్రతి గుణానికీ రెండు యుగ్మ వికల్పాలు (alleles) ఉంటాయి. వాటిలో ఆధిపత్యమైనది (dominant), అప్రభావమైనది (recessive) అని రెండు రకాలు. ఆధిపత్యగుణం నీలి రంగుగా (అచ్చు 'ఎ' అనుకొందాం), అప్రభావమైన గుణం నారింజ రంగుగా (హల్లు 'యె' అనుకొందాం) భావిస్తే, అవి రెండు రంగుల చేపలతో చిత్రం పైపైపు కనపడతాయి. నీలి రంగు చేప సమయుగ్మజం (homozygous, అంటే యుగ్మ వికల్పాలు రెండూ ఒక రకంలోనే ఉండడం; 'ఎఎ' అన్నమాట), నారింజ రంగు చేప విషమయుగ్మజం (heterozygous, 'యెయె') అయితే, వీటి సంతానం వంద శాతం నీలి రంగులోనే ఉంటాయి. కానీ ఈ మొదటి తరం అన్నీ ఆధిపత్యవిషమయుగ్మజాలుగా ('ఎయె') పుడతాయి. రెండో తరంలో, 75 శాతం మాత్రమే నీలి రంగులో ఉంటాయి. అందుకే కింది వరుసలో నాలుగింట్లో మూడు నీలి చేపలు, ఒక నారింజ చేపా కనిపిస్తాయి. మళ్ళీ ఆ మూడు నీలి చేపలలో ఒకటి మాత్రమే సమయుగ్మజం ('ఎఎ') అయ్యుంటుంది, తక్కిన రెండూ నీలి రంగు 'ఎయె'లవుతాయి. ఆ ఒక్క నారింజ చేప మాత్రం తప్పక సమయుగ్మజమై తీరుతుంది. ఇదంతా సైన్స్ పాఠంలో ఉన్నదే అయినా అందమైన చిత్రంలో చూస్తే, మామూలు కన్నా ఇంకా బాగా అర్థమౌతుంది. ఈ చిత్రాన్ని ఇంట్లో గోడ మీద తగిలిస్తే, ఇంట్లో వాళ్ళందరికీ కూడా సైన్స్ పట్ల జిజ్ఞాస కలిగే అవకాశం ఉంది. మరి ఆ తామరలూ, తాబేలూ, చిన్న పాముా అవేమి సూచిస్తాయంటారా! తామరపూలలో



అండాశయం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. అది స్త్రీ జీవకణానికి చిహ్నం. అలాగే చిన్న పాము పురుష జీవకణానికి సంకేతం. మరి తాబేలో? మీకే తెలుసు. అది నిదానానికి గుర్తు.

## మన దేహంలో జరిగే యుద్ధం 'చేర్యాల్'లో...

చేర్యాల్ చిత్రంలో ప్రతిజనకం (antigen), ప్రతిరక్షకం (antibody) ల మధ్య మన దేహంలో నిత్యం జరిగే యుద్ధాన్ని చిత్రీకరించారు. ఎర్రటి కాన్వాస్ మీద పురాణగాథలు,







ఆర్టిస్టులు : గండి మౌనిక, కైవల్య ఎం,మల్లసాయి ప్రత్యూష, సబరీష్ ఆర్.

ప్రకాశవంతమైన రంగులు చేర్యాల్ చిత్రాల ప్రత్యేకత. అవేవీ పొల్లుపోకుండా కనిపిస్తాయి ఈ చిత్రంలో. ప్రతిరక్షకాలు హానికరమైన ప్రతిజనకాలను ఎలా హతమారుసాయో ఈ చిత్ర శ్రేణి సూచిస్తుంది. అంతేకాదు, ఇంకా విశేషముంది గమనిస్తే. చిత్రంలో కనిపించే నాలుగు రక్షకభటుల్లాంటి ప్రతిరక్షక కణాల చేతుల్లో నాలుగు విధాలైన ఆయుధాలున్నాయి. అలాగే, రెండు ప్రతిజనకాల దగ్గర వేర్వేరు రకాల ఆయుధాలున్నాయి. ఇదెందుకంటే, ప్రతి ప్రతిరక్షకానికీ ప్రతి ప్రతిజనకానికీ నిర్దిష్టమైన సంబంధముంది. ప్రతి ఒక్కటీ తత్సంబంధిత దానితోనే పోరాడుతుందన్నమాట. ఇలాంటి ఎన్నో సూక్ష్మ విషయాలను కూడా ఇమిడ్చారు ఈ చిత్రాల్లో విద్యార్థులు.

సమీకరణాలూ, గుర్తులూ వాడకుండా ఒక గణిత సూత్రాన్ని బొమ్మతో చూపడం కూడా సాధ్యమేనని ఆకులున్న చెట్టు సాయంతో చూపిస్తుంది ఈ సాంఘీ చిత్రం. ఏ పూర్ణసంఖ్య నుంచి అయినా రెండే రెండు నిబంధనలతో (సరి సంఖ్య ఐతే సగం చేయడం, బేసిసంఖ్య ఐతే మూడుతో హెచ్చించి ఒకటి కలపడం) ఒకటికి చేరుకోవచ్చనేది కొలాజ్ ఉజ్జాయింపు. లెక్కవేసి చూసుకోండి. 13తో మొదలెడితే, (13 x 3 + 1) = 40 వస్తుంది. 40 సగమై 20, ఆ తర్వాత 10, 5, 16, 8, 4, 2, చివరికి 1 అవుతుంది. 32తోనూ అలాగే. ఏ పూర్ణ సంఖ్యతోనైనా చివరికి ఒకటి వస్తుందని చెబుతుంది ఈ చిత్రం. ఇంతవరకూ రుజువు చేయబడని ఈ విషయానికి మరో కోణం కూడా కనిపిస్తుంది ఈ చిత్రంలో. అన్ని పూర్ణ సంఖ్యలూ ఒకటికి చేరతాయి కాబట్టి, వెనక నుంచి చూస్తే, అన్ని సంఖ్యలూ ఒకటి నుంచే ఉద్భవిస్తాయన్న విషయాన్ని ఒక చెట్టు ఆకుల రూపంలో చూపబడింది. స్థలాభావం వలన కాబోలు చిన్న ఆకుల్లో పెద్ద సంఖ్యలు చూపలేకపోయారు. అయితేనేం మన దేశంలోని 'భిన్నత్వంలో ఏకత్వం' శబ్దార్థ ప్రకారంగా చూపబడింది. సాంఘీ చిత్రాలు రంధ్రాల రేకు (stencil) ఉపయోగించి చిత్రీకరిస్తారు. అదే శైలి కనిపిస్తుంది ఈ చిత్రంలోనూ. ఒక గణిత అంశాన్ని సాంఘికశాస్త్ర విషయంతో ముడివేసి ఒక జానపద చిత్ర రీతిలో అందంగా చూపడం మామూలు విషయం కాదు. ఇక్కడ అందంగా కనిపించేది గణితమా? సాంఘీ చిత్రమా? సాంఘిక శాస్త్ర విషయమా? తేల్చుకోండి మీరే.

ఆర్టిస్టులు : కొల్హాట్కర్ సంపద సి, మిలింద్ హెగ్డే, సుహాస్ మహేశ్, మేధా శేఖర్

ఇవన్నీ పాఠశాలల్లో, కళాశాలల్లో గోడల మీద ఉండాల్సిన చిత్రాలు. ఇళ్లల్లో కూడా. అందానికి అందం ఒలికిస్తూ విజ్ఞానానికి విజ్ఞానం కనబరుస్తూ మన జానపద చిత్రకళలలోని గొప్పదనాన్ని చాటిచెప్పే అపురూపమైన చిత్రాలివి. ఈ మధ్యనే ఈ చిత్రాలను ఐఐఎస్సీ ప్రెస్ (http://www.iisc.ac.in/outreach/publications/iisc-press/) పుస్తకరూపంలో 'ఆర్టింగ్ సైన్స్' (Arting Science) అనే పేరుతో ప్రచురించింది.

## గొప్ప శాస్త్రజ్ఞులకు లలితకళల్లో ప్రవేశం

"సైన్స్ విద్యార్థులు జానపద చిత్రకళలను అభ్యసించడం వల్ల కలిగే ప్రయోజనమేముంది?" అని కొందరు అడగొచ్చు. శాస్త్రవేత్తలూ, కళాకారులూ వేర్వేరు తెగల వారు అని అనిపించినా, వారి మధ్య సారూప్యం ఎంతో ఉంది. ఇద్దరికీ ప్రతి చిన్న విషయాన్ని పరిశీలించి చూసే తత్త్వం ఉండాలి. తాము గమనించి అర్థం చేసుకొన్న విషయాలను వాళ్ళు పదిమందికీ తెలపాలి. వివిధ జానపద చిత్రకళలను అధ్యయనం చేయడం వల్ల సైన్స్ విద్యార్థుల పరిశీలనా పటిమ ఇనుమడిస్తుంది. తమ చుట్టూ ఉన్న సంఘంతో వారికి గట్టి బంధం ఏర్పడుతుంది. వారిలో నిక్షిప్తమైన, తమకే తెలియని చిత్రలేఖన చాతుర్యం బహిర్గతమయ్యే అవకాశమూ ఉంది. గొప్ప శాస్త్రజ్ఞులలో చాలామంది లలితకళలలో ప్రవేశం ఉన్నవారే. ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ ఫిడేల్ వాయించేవారట. రిచర్డ్ ఫేమెన్ డోలు బహు బాగా మోగించేవారట. ఈనాటి ప్రఖ్యాత గణితశాస్త్ర ప్రవీణుడు మంజుల్ భార్గవ్ తబలా వాయించడంలో నిష్ణాతుడు. కళలు అలవరచుకోవడం శాస్త్రజ్ఞులకు ఆటవిడుపు మాత్రమే కాదు,

ఇందులో ఒక భారతీయ గణితవేత్త, ఒక ఆరబ్ వ్యాపారి ఉన్నారు. ఒక ఆవు, ఒంటె ఉన్నాయి. భారతీయుడు కనిపెట్టిన సున్నాకు ఆరబ్బుల ద్వారా లభించిన ప్రచారాన్ని జమినీ రాయ్ కాళీఘాట్ చిత్రకళారీతిలో చూపించిన చిత్రమిది.
ఆర్టిస్టులు : తన్మయ్ పాల్, అమ్లన్ దాస్, సైబల్ డే, సుభజిత్ దాస్‌గుప్తా.



వారిలోని సృజనాత్మకతకు ఇంకో వ్యక్తీకరణ మార్గం కూడా.



సైన్స్ మరియు ఆర్ట్‌కి ఇంకో ముఖ్యమైన సంబంధం ఉంది. ఒక్క బొమ్మైనా లేని సైన్స్ (గణితం సహా) పుస్తకం అరుదు. వెయ్యిపదాలకన్నా ఒక్క చిత్రం చాలన్నట్టు, ప్రతి శాస్త్ర విభాగంలోను సంక్లిష్టమైన విషయాలను బొమ్మలతో సులువుగా చూపించే వీలుంది. అదెందుకని ఆలోచిస్తే, దానికి కారణం మన మెదడే. మన మెదడులో అత్యధిక భాగం దృష్టి ప్రవర్తనానికి, అంటే visual processing కి, కేటాయించబడి ఉంది. ఒక ముఖ బింబాన్ని మన మనిషి మెదడు గుర్తించినంత వేగంగా ఏ కంప్యూటర్ ప్రోగ్రాం గుర్తించలేదు. మన దేహంలో 70 శాతం జ్ఞానేంద్రియ గ్రాహక కణాలు (sensory receptors) కళ్లలోనే ఉన్నాయట. మెరిసే రంగులూ, కదిలే చిత్రాలూ మనుషులను ఇట్టే ఆకర్షిస్తాయి. విన్నదాంట్లో 10 శాతం మాత్రమే మనకు గుర్తుంటుందట. అలాగే చదివినదాంట్లో 20 శాతం. చూసినదాంట్లో 80 శాతం గుర్తుంటాయట. అందుకే చిత్రాలు శిక్షణలో అతి ముఖ్యం.

గ్లోబల్ వార్మింగ్ గురించి వేసిన చిత్రమిది. మూడు వేర్వేరు కాలాల్లో భూమి ఎలా ఉండేదో చూపించే ప్రయత్నం చేశారు. మొదటిది మనుషులు ప్రకృతితో సఖ్యంగా ఉండి జీవించడం, రెండోది విధ్వంసం, మూడోది వేరే చోటికి తరలిపోవడాన్ని చిత్రీకరించారు. ఇదీ వర్లీ కళారీతే. ఆర్టిస్టులు : చంచల్ సోని, విప్లవేందు దాస్, ఆదర్శసింగ్, రాహుల్ సింగ్.



సైంటిఫిక్ సాహిత్యంలో కూడా చిత్రకళల (visual arts) పట్ల ఆసక్తి పెరుగుతోంది. కొత్తపోకడలు కనిపిస్తున్నాయి. Biocanvas.net అనే వెబ్-సైట్‌లో సైంటిఫిక్ పరిశోధనలలో కనుగొన్న విషయాలు కనువిందైన చిత్రాలలో కనిపిస్తాయి. bpodmrc.tumblr.comలో రోజుకొక్క అద్భుతమైన సైంటిఫిక్ చిత్రం కనిపిస్తుంది. యానిమేషన్, అంటే కదిలే కంప్యూటర్ చిత్రాలు సరేసరి. SIGGRAPH అనే ప్రతిష్ఠాత్మకమైన కంప్యూటర్ గ్రాఫిక్స్ సమావేశంలో ముందుముందు సినిమాల్లో కనిపించే విజువల్ ఎఫెక్ట్స్ అన్నీ ఇప్పుడే చూడొచ్చు.



ఇది మినియేచర్ కళారీతి. మనిషి - రోబోల కలయికను సూచించే ఈ చిత్రంలో రోబోకు ప్రతీకగా కృష్ణుడ్ని, మనిషికి ప్రతీకగా రాధను తీసుకున్నారు. ఆర్టిస్టులు : దీప్తపర్ణ బిస్వాస్, ఆత్రేయ డే, మయూఖ్ నాథ్.

## థియేటర్‌లో 'అల్గారిథం'

ఇవన్నీ ఒక ఎత్తయితే క్లిష్టమైన విషయాలను కొంచెం సులువుగా మనకు బోధపడేలా చేసే ప్రక్రియ ఒకటి ఐఐఎస్సీలో ఈ మధ్యనే మొదలయ్యింది. అవి తేజస్విని పద్మ అనే విద్యార్థిని వేసిన చిత్రాలు. ఆమె మొత్తం మూడు చిత్రాలు వేయగా అందులో కాస్త సులభంగా అర్థమయ్యే ఒక చిత్రం గురించి వివరిస్తాను. అది సినిమా థియేటర్ చిత్రం. ఇది ఒక కంప్యూటర్ అల్గారిథం గురించి చెబుతోంది. ఆ అల్గారిథం పేరు 'యాక్టర్-క్రిటిక్'. ఇది కనుగొన్నది ఐఐఎస్సీ లోని మరో ప్రొఫెసర్ శలభ్ భట్నాగర్, ఆయన రీసెర్చ్ గ్రూప్. చిత్రంలో తెరపై కనిపించే మనిషి యాక్టర్. కూర్చొన్న వాళ్లు క్రిటిక్స్. మచ్చుకు ఒక క్రిటిక్, అంటే విమర్శకుడు, పెద్ద బొమ్మలో దీర్ఘాలోచనలో కన్పిస్తాడు. వారిద్దరూ సమాచారాన్ని డేటాని ఒకరి నుంచి ఇంకొకరు తీసుకొంటారు. ఈ ప్రక్రియలో వారు ఆ డేటా లక్షణాలను (features) మారుస్తారు. అందుకే 'Feature film' అని రాసుంది ద్వంద్వార్థంతో. రెండో అర్థం ఏమిటంటే అది సినిమా హాల్లో ప్రదర్శించబడుతున్న సినిమా. యాక్టర్, క్రిటిక్ అల్గారిథంలోని భాగాలు మాత్రమే. అవి చిత్రరూపంలో మనుషులుగా చూపబడ్డారంతే. ఈ అల్గారిథం ఇప్పుడు బహుళ ప్రాచుర్యంలో వున్న మెషీన్ లెర్నింగ్ కోవకు చెందినది. ఇది ట్రాఫిక్ కంట్రోల్‌లో ఉపయోగపడుతుంది. వాహనాల ట్రాఫిక్ (అందుకే చిత్రంలో ఒక వాహనం ఉంది) మాత్రమే కాదు, డిజిటల్ ట్రాఫిక్ (అందుకే ఒక మోడెమ్ కనిపిస్తుంది) కూడా. అంతుంది ఈ చిత్రంలో.




ఆర్టిస్ట్ : తేజస్విని పద్మ

"నిగూఢమైన చిత్తరువొక్కటి చాలిక చాలు; అగుపించునందే భావాలు వేలకువేలు" అని అనిపించేలా వేయడం మాములుగా పికాసో లేదా ఎం. ఆఫ్. హుస్సేన్ లాంటి abstract artists చేసే పని. సైన్స్ విషయాలు వివరించేందుకు ఇంత 'గూడుపుఠాణి' అవసరమా అంటారేమో! వెంటనే అర్థమైతే అది మనకు అంత రుచించదు, మరచిపోతాం కూడా. ఆలోచించిన తర్వాత అర్థమయితే రసపట్టుగానూ ఉంటుంది, ఆ విషయం గురించి మరింత తెలుసుకోవాలనీ అనిపిస్తుంది.

రాతియుగపు మనుషులు రాళ్ళపై ఆనాటి జీవితాన్ని చిత్రించారు భీంబెట్కా శిలాశ్రయాల్లో. డా. బితస్తా దాస్ విద్యార్థులు పాఠ్యపుస్తకాల్లో ఉన్న సిద్ధాంతాలను భారతీయ జానపద చిత్రరీతుల్లో చిత్రించారు. ఐఐఎస్సిలో ప్రస్తుతం జరుగుతున్న పరిశోధనా ఫలితాలకు అద్దంపడుతూ తేజస్విని పద్మ ఒక వినూత్న రీతిలో చిత్రాలు తయారు చేస్తున్నారు. దీన్ని శాస్త్రవేత్తల కోవకు చెందిన నవీన జానపద కళ అనుకోవచ్చేమో! శాస్త్రజ్ఞులు తమ భాషను వాడకుండా, సులభమైన చిత్ర రీతిలో సకల ప్రజానీకానికి తెలియజెప్పే ప్రయత్నంగా భావించవచ్చేమో! ఐఐఎస్సి వెబ్ సైట్ (http://www.iisc.ac.in) లో 'Arting Science' అన్న శీర్షికలో ఎన్నో చిత్రాలు, సంబంధిత వివరణలతో ఉన్నాయి. వాటి ద్వారా ఎంతో పరిశోధనా పరిజ్ఞానాన్ని ఎవరైనా పొందవచ్చు. ఇది జ్ఞానపథానికి జానపద కళ (abstract sciart) అనదగిన చిత్రకళ.

(రచయిత ఐఐఎస్‌సిలో ప్రొఫెసర్)

ananthasuresh@gmail.com





# టాయ్ అంకుల్

దేశాల మధ్య యుద్ధ వాతావరణం ఎందుకుందో వారికి తెలీదు. చెప్పినా అర్థం చేసుకోలేరు. కెమెరాకీ, గన్‌కీ మధ్య ఉన్న తేడా కూడా గుర్తించలేని పసివాళ్లు. వేళకింత ఆహారం, నిద్ర.. కొంచెం ప్రేమ, ఇంకొంచెం ఆప్యాయత.. ఆడుకోడానికి బొమ్మలు ఇవే వారు కోరుకునేవి. అందుకే తన దేశపు పిల్లలకు ఆనందాన్ని పంచేందుకు ఒక 'స్మగ్లర్'గా మారాడు రమీ అదామ్. యుద్ధభూమిలా మారిన సిరియాకి బాంబులు తీసుకెళ్లేవాళ్లు ఉంటారు, ఆధునిక తుపాకీల తయారీకి అవసరమైన సామాగ్రిని స్మగ్లింగ్ చేసేవాళ్లు ఉంటారు. కాని రమీ మాత్రం బొమ్మలను తీసుకెళ్లి వారి ముఖాల్లో నవ్వులను పూయిస్తున్నాడు. ఇప్పటికే సిరియాకి 28 సార్లు అక్రమంగా వెళ్లి 20 వేల బొమ్మలను పిల్లలకు పంచిపెట్టాడు రమీ.

"నేను సిరియాలోనే పుట్టాను. నాకు 17 ఏళ్లప్పుడు పైచదువుల కోసం ఫిన్‌లాండ్‌కు వెళ్లాను. అప్పుడు సిరియా చాలా ప్రశాంతంగా ఉండేది. అయితే ఇప్పుడు పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ఏ క్షణాన ఏం జరుగుతుందో తెలియని పరిస్థితి. ఇటువంటి భయానక వాతావరణంలో పిల్లల పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించుకోవచ్చు. అందుకే వారి ముఖాల్లో ఆనందం చూసేందుకు నేను బొమ్మలు పంచడం మొదలుపెట్టాను. ఇది నా కూతురు ఇచ్చిన సలహా. బొమ్మలు పంచుదామని మొదటిసారి సిరియాకు వచ్చినప్పుడు అధికారికంగా అన్ని పన్నులు చెల్లించి 70 కిలోల బొమ్మలు తీసుకొచ్చి పంచాను. కాని 2015లో టర్కీ సిరియా సరిహద్దుని మూసివేసింది. ఏం చేయాలో అర్థం కాలేదు. అందుకే అనధికారికంగా అయినా బొమ్మలను సిరియాకు తీసుకెళ్లాలి అనుకున్నాను. అది స్మగ్లింగ్ అని తెలుసు. అయితే పిల్లల ఆనందం కోసం నేను చేసేది తప్పు కాదని అనిపించింది" అని చెప్పాడు రమీ అదామ్.

సిరియాలోని అలెప్పో, అమ్‌తే ప్రాంతాల ప్రజలు కూడా బొమ్మలు తీసుకెళ్లడంలో అతనికి సహాయ పడతారు. కేవలం బొమ్మలు మాత్రమే కాకుండా పిల్లలకు కావలసిన ఆహారం, మందులను కూడా తీసుకెళతాడు రమీ. బొమ్మల ఖర్చు కాకుండా ఇప్పటిదాకా దాదాపు 40 వేల యూరోలను (28 లక్షల రూపాయలకు పైగా) పిల్లల ఆహారం, మందుల కోసం ఖర్చుచేశాడు రమీ. వారికోసం టర్కీ సరిహద్దులో మూడు స్కూళ్లను కూడా నిర్మిస్తున్నాడు.

"బొమ్మలు పిల్లలకు ఆనందాన్ని స్తాయి. కాని ఆకలిని తీర్చలేవు. అందుకే వారికి కావలసిన ఆహారాన్ని కూడా తీసుకెళతాను. సిరియాలో 66 శాతం మంది పిల్లలు బడికెళ్లడం మానేశారు. ఇది ఇలాగే కొనసాగితే దేశ భవిష్యత్తు అంధకారంలో పడిపోతుంది. అందుకే వారికి విద్యను అందించడం కూడా ఎంతో అవసరం" అంటాడతను. భార్యాపిల్లలతో ఫిన్‌లాండ్‌లో నివాసముండే రమీఅదామ్‌కి ఆరుగురు పిల్లలు. ఇద్దరు అబ్బాయిలు, నలుగురు అమ్మాయిలు. వీళ్లంతా రమీకి ఈ విషయంలో చాలా సహాయం చేస్తారు. బొమ్మలను మా పిల్లలే ప్యాక్ చేస్తారు. ఆరు వారాల ముందుగానే సిరియాకు ఎలా వెళ్లాలో.. ఏ ప్రాంతాల మీదుగా వెళ్లాలో వ్యూహం రూపొందించుకుంటాడు రమీ.

"ఒకసారి బొమ్మలు తీసుకెళుతున్న నాపైన రాకెట్ దాడి జరిగింది. తల, వెన్నెముక, భుజాలకు తీవ్రమైన గాయాలయ్యాయి. అయినా నేను భయపడలేదు. భయంతో వణికిపోతున్న పిల్లల ముఖాల్లో నవ్వులు చూడాలనే ఆశయం కంటే నా ప్రాణం విలువైనదేమీ కాదని అనుకున్నాను. నాకేమైనా అయితే పిల్లలను చూసుకుంటానని నా భార్య భరోసా ఇచ్చింది. అంతకన్నా ఇంకేం కావాలి?" అని గర్వంగా చెబుతున్న రమీ అదామ్ సిరియా బాధితుల కోసం 'సుయోమి సిరియా యెతిసో' SUOMI SYYRIA YTHEISO' (SSY) అనే ఒక స్వచ్ఛంద సంస్థను కూడా ఏర్పాటుచేశాడు. ప్రతి రెండు నెలలలకు ఒకసారి వచ్చి బొమ్మలిచ్చి, తమతో ఆడుకునే రమీ అదామ్‌ను సిరియన్ పిల్లలు ప్రేమగా 'టాయ్ అంకుల్' అని పిలుచుకుంటారు.





# నా ఇష్టం




వాస్తు లేక పోయినా పర్లేదు పంతులు గారూ?
ఆ గోడని పడగొట్టే పని మాత్రం చేయను!!


Beware of my Wife


సరే... సరే
ఆఖరి ఓవర్
చూపిస్తా రండీ!!


వెళ్లొస్తారా. గెస్ట్‌లు ఎక్కువసేపు
కూర్చోవడం మీకు ఇష్టం లేనట్టుంది!!


సారీ మానవా,
నా దగ్గరా పాత
నోట్లే ఉన్నాయి!!
500

"అమ్మా... నేను టెర్రస్‌పై క్రాకర్స్ కాల్చుకునేందుకు వెళ్తున్నా" అంటూ ప్లేట్లోని పెరుగన్నాన్ని గబగబా తినేసి పరుగుతీశాడు గోపాల్.

"ఒరేయ్ పిచ్చిసన్నాసి. ఆగరా..." అని లక్ష్మమ్మ అరుస్తున్నా అతను వినిపించుకోలేదు.

30 ఏళ్లు దాటినా గోపాల్‌లో చిన్నపిల్లాడి చేష్టలు తగ్గలేదనుకుంది లక్ష్మమ్మ. దానికితోడు 150 కిలోల బరువుంటాడు కాబట్టి అందరూ అతడ్ని వింతగా చూస్తారు. పెళ్లానికి ఇతడి పొడగిట్టదు. అందుకే పెళ్లయిన కొంతకాలానికే విడిచిపెట్టి వెళ్లింది. దీపావళి రావడంతో వాచ్‌మ్యాన్ పిల్లలతో కలిసి క్రాకర్స్ కాల్చేందుకు టెర్రస్ మీదకు వెళ్లాడు గోపాల్.

రియల్ క్రైమ్ కహానీ - 29

# అమావాస్య చీకట్లో...

మంగాపురంలోని ఆ అపార్ట్‌మెంట్ టెర్రస్ మీద గోపాల్ దగ్గరుండి పిల్లలతో క్రాకర్స్ కాల్పిస్తున్నాడు. కాస్త దూరంలో ఉన్న పక్క అపార్ట్‌మెంట్‌లో... వృద్ధ దంపతులిద్దరూ టెర్రస్ మీద ఈవెనింగ్ వాక్ చేస్తున్నారు. కాసేపటికి తర్వాత 'టప్' మని తుపాకీ పేలిన శబ్దం వినిపించింది. అది దీపావళి తుపాకీ శబ్దం కాదని వెంటనే తెలిసిపోయింది వారికి. అనుమానంగా గోపాల్ క్రాకర్స్ కాలుస్తున్న అపార్ట్‌మెంట్‌వైపు చూశారు. గోపాల్‌ను కొంతమంది చుట్టుముట్టిన సీన్ కనిపించింది.

"అయ్యో... అక్కడేదో గొడవ జరుగుతున్నట్టుంది. వారంతా కలిసి అతడ్ని కొడుతున్నారు" అంటూ అప్రమత్తమైన దంపతులిద్దరూ వెంటనే డయల్ 100కి ఫోన్ చేశారు.

•••

పోలీసులు వచ్చేసరికి అక్కడ సీన్ బీభత్సంగా ఉంది. ఒకటి కాదు రెండు కాదు మృతదేహంపై అంగుళానికో కత్తిపోటు ఉంది. ఆ ప్రాంతమంతా రక్తమయమైంది. కుషాయిగూడ ఇన్‌స్పెక్టర్ వెంకటరమణ హత్యాప్రదేశాన్ని నిశితంగా పరిశీలిస్తున్నారు. పోలీసులు చుట్టుపక్కల వాళ్ల దగ్గరి నుంచి వివరాలు సేకరిస్తున్నారు. అక్కడే ఉన్న పూలకుండీ పక్కన చీకట్లో ఏదో మెరుస్తుండటాన్ని గుర్తించి సెల్‌ఫోన్ లైట్ వేశారు ఇన్‌స్పెక్టర్.

"సార్... ఇది బుల్లెట్ షెల్" అని కానిస్టేబుల్ అనడంతో అలర్ట్ అయ్యారు వెంకటరమణ.

వెంటనే ఏసీపీ సయ్యద్ రఫీకి ఫోన్ కలిపారాయన.

"సార్... మంగాపురంలోని ఒక అపార్ట్‌మెంట్ టెర్రస్ మీద మర్డర్ జరిగింది. హంతకులు ఫైర్ ఆర్మ్ ఉపయోగించారు. బుల్లెట్ షెల్ దొరికింది" అంటూ తాను గుర్తించిన వివరాలను తెలిపారు.

"ఔనా... తుపాకులు ఉపయోగించారంటే సీరియస్ థింగ్. నేనిప్పుడే అక్కడికి వస్తున్నా" అన్నారు రఫీ.

మరి కాసేపటికి ఏసీపీ రఫీతో పాటు డీసీపీ రమేష్ నాయుడు అక్కడికి చేరుకున్నారు. తుపాకీతో కాల్పులు జరిపి, కత్తులతో కూడా నరికి చంపారంటే పోలీసుల దృష్టిలో అది పెద్ద నేరం. అందుకే సీనియర్ పోలీసు అధికారులంతా ఈ కేసును మినిట్ టు మినిట్ ఫాలో అప్ చేస్తున్నారు. పై అధికారులకు కేసు వివరాలు అందించిన తర్వాత మృతదేహాన్ని పోస్టుమార్టంకు తరలించారు.

•••

దీపావళి మర్నాడు కుషాయిగూడ పోలీసుస్టేషన్‌లో ఇన్‌స్పెక్టర్ వెంకటరమణ తన బృందంతో సమావేశమయ్యారు.

"గోపాల్ మృతదేహంపై 54 కత్తిపోట్లు ఉన్నట్లు పోస్టుమార్టం ప్రాథమిక నివేదిక స్పష్టం చేస్తోంది. అతడ్ని తుపాకీతోనూ కాల్చారు. అయితే బుల్లెట్స్ అతనికి తగిలినట్లు లేవు. రెండు బుల్లెట్ షెల్స్ దొరికాయక్కడ. బుల్లెట్ షెల్స్ చూస్తుంటే నాటుతుపాకి వాడినట్లు కన్పిస్తోంది.." అన్నారు ఇన్‌స్పెక్టర్.

"అవున్సార్... మనిషి ప్రాణం పోయేవరకు కత్తులతో పొడిచారంటే తీవ్రమైన కక్ష అయినా ఉండాలి. లేదా కిరాయి హంతకులైనా అయి ఉండాలి" అన్నారు ఎస్సై సురేష్.

"సో... మనం ముఖ్యంగా గోపాల్ కుటుంబ నేపథ్యం, స్నేహితులు, శత్రువులు, అతని సెల్ ఫోన్ కాల్ డిటెల్స్ , సీసీ కెమెరాల ఫుటేజ్ పరిశీలించాలి" అంటూ ఆ బాధ్యతలను ఎస్సైలైన సురేష్, అశోక్, అనిల్‌కు అప్పగించారు ఇన్‌స్పెక్టర్ రమణ.

•••

విచారణ ప్రారంభమైంది.



బొమ్మ : పినిశెట్టి

గోపాల్ ఇంటికి వెళ్లారు ఇన్‌స్పెక్టర్ రమణ. చెట్టంత కొడుకును పోగొట్టుకుని దిగాలుగా కూర్చుంది గోపాల్ తల్లి లక్ష్మమ్మ. గోపాల్ చెల్లెలు గిరిజ నుంచి వివరాలు రాబట్టే ప్రయత్నం చేశారు రమణ.

"సార్... మా అన్నయ్య చాలా మంచివాడు. మాకు ఐదెకరాల పొలం ఉంది. అక్కడో డైరీఫామ్ పెట్టాం. దాదాపు మూడు కోట్ల రూపాయలు ఖర్చుపెట్టాం. అన్నయ్య పెళ్లి వినీలతో అయిన తర్వాత వాళ్లిద్దరు డైరీఫామ్ చూసుకునేవారు. నేను మా అత్తారింట్లోనే ఉండేదాన్ని" అంది గిరిజ.

"మరి మీ వదిన ఎక్కడ? కన్పించడం లేదేంటి?"

"ఏడాది నుంచి వాళ్లిద్దరు దూరంగా ఉంటున్నారు. ఆమె విడాకులు కావాలంటోంది. మా అన్నకు విడాకులు ఇవ్వడం ఇష్టం లేదు. చూశారా... మా అన్నయ్య చనిపోయాడని తెలిసినా ఆమె కనీసం చివరిచూపు చూసేందుకైనా రాలేద"ంటూ భోరుమంది గిరిజ.

విచారణలో హత్యకు కొద్దిసేపటి ముందు వాచ్‌మ్యాన్ పిల్లల్ని గోపాల్ టెర్రస్ పైకి పిలిపించి క్రాకర్స్ కాల్పించిన విషయం చెప్పారు అందరూ. ఆ పిల్లలంతా పదేళ్లలోపు వారే. వారి నుంచి కూడా కొన్ని వివరాలు రాబట్టే ప్రయత్నం చేశారు ఇన్‌స్పెక్టర్.

"అంకుల్ ... మేము గోపాల్ అంకుల్‌తో కలిసి క్రాకర్స్ కాలుస్తున్నాం. అప్పుడో ఆంటీ వచ్చి అంకుల్‌తో ఏదో మాట్లాడింది. ఆ తర్వాత మా దగ్గరకొచ్చి ఇంకా క్రాకర్స్ కొనుక్కొద్దాం రండి అంటూ కిందకు తీసుకెళ్లింది. ఆ తర్వాత ఆంటీ మాకు క్రాకర్స్ కొనిచ్చి వెళ్లిపోయింది. మేము ఇంటికి వచ్చేసరికి పోలీసులున్నారు" అన్నారు పిల్లలంతా.

"ఆమె ఎవరో మీకు తెలుసా... ఇంతకు ముందు ఎప్పుడైనా చూశారా..?."

"ఏమో తెలియదంకుల్... మేము ఇక్కడికి కొత్తగా వచ్చాం" అన్నారు.

పిల్లలు చెప్పిన వివరాల ఆధారంగా అపార్ట్‌మెంట్‌కు వచ్చిన మహిళ విజువల్స్‌ను క్యాప్చర్ చేశారు. సన్నగా, పొడుగ్గా ఉన్న అమ్మాయి పంజాబీ డ్రెస్ వేసుకుని ఉంది. ముఖం కన్పించకుండా స్కార్ఫ్ కట్టుకుంది. కేవలం కళ్లు మాత్రమే కన్పిస్తున్నాయి. 'ఆ యువతి పోలికలు కొద్దిగా మా వదిన వినీలలాగా ఉంద'ని గోపాల్ చెల్లెలు గిరిజ చెప్పడంతో వినీలతో మాట్లాడటానికి ఒక టీంను పంపించారు. అయితే తాను అక్కడికి రాలేదని వినీల చెప్పింది.

"వినీలపై అనుమానాలు వ్యక్తమవుతున్నాయి కాబట్టి ఆమె ఫోన్‌కాల్స్ లిస్టు, టవర్ లోకేషన్ చెక్ చేస్తే సరిపోతుంది" అన్నారు ఇన్‌స్పెక్టర్.

కొద్ది గంటల్లోనే పోలీసుల చేతికి వినీల కాల్‌లిస్టు అందింది. అదే ఈ కేసు చిక్కుముడి వీడటానికి కారణమైంది.

•••

గోపాల్ హత్య కేసులో అతడి భార్య వినీలకేగాక మరొకరికి కూడా సంబంధం ఉందనే విషయం బయటపడింది. అతడే బ్యాంక్ మేనేజర్ రవీందర్‌రెడ్డి.

వివరాల్లోకి వెళితే...

గోపాల్ మూడుకోట్ల రుణం తీసుకుని డైరీఫామ్ ప్రారంభించాడు. ఆ తర్వాత అతనికి పెళ్లయ్యింది. డైరీఫామ్ వ్యాపారంలో తీవ్రమైన నష్టం వచ్చింది. దాంతో తీసుకున్న రుణం చెల్లించమని బ్యాంకు వాళ్లు ఒత్తిడిచేశారు. ఈ ఒత్తిళ్లు భరించలేక, ఇంట్లో ఉన్న మూడు కిలోల బంగారు ఆభరణాలను ఘట్‌కేసర్‌లోని ఐసిఐసిఐ బ్యాంకులో తాకట్టు పెట్టి ఆ డబ్బుతో బ్యాంకు రుణం తీర్చాడు.

బంగారం కుదువపెట్టడానికి బ్యాంకుకు వెళ్లినపుడు ఐసిఐసిఐ బ్యాంకు మేనేజర్ రవీందర్‌రెడ్డి గోపాల్ భార్య వినీల ఫోన్‌నెంబర్ తీసుకున్నాడు. బంగారాన్ని ఒకేసారి కాకుండా మూడు విడతలుగా కుదువపెట్టడంతో వినీల నాలుగైదుసార్లు బ్యాంకుకు వెళ్లాల్సొచ్చింది. అప్పుడే బంగారాన్ని కుదువ పెట్టడం వినీలకు ఇష్టం లేదన్న విషయాన్ని రెడ్డి గుర్తించాడు. మెల్లిగా ఆమెతో మాటలు కలిపాడు. వల విసిరాడు. అప్పటికే భర్త మీద తీవ్రమైన అసంతృప్తితో ఉన్న వినీల త్వరగానే మేనేజర్ రవీందర్‌రెడ్డి వల్లో పడిపోయింది. ఆ తర్వాత బంగారం విషయంలో గొడవపడి గోపాల్‌ను విడిచిపెట్టింది. మేనేజర్‌తో కలిసి ఉండటం మొదలెట్టింది.

**తాను బ్యాంకులో కుదువ పెట్టిన బంగారంలో ఒక కిలో బంగారాన్ని తనకు చెప్పకుండా మేనేజర్ రవీందర్‌రెడ్డి ఆక్షన్ పెట్టి అమ్మేసాడన్న విషయాన్ని గోపాల్ తెలుసుకున్నాడు. తనకు తెలియకుండా దాన్ని అమ్మడమేగాక, బినామీల పేరిట ఆ బంగారాన్ని కొనిపించి వినీలకు కానుకగా ఇచ్చినట్టు కూడా తెలుసుకున్నాడు గోపాల్. ఈ విషయాన్ని బ్యాంకు ఉన్నతాధికారులకు ఫిర్యాదు చేస్తానని, వడ్డీ కట్టినా ఎలా వేలం వేస్తారంటూ గొడవ పడ్డాడు.**

తాను బ్యాంకులో కుదువ పెట్టిన బంగారంలో ఒక కిలో బంగారాన్ని తనకు చెప్పకుండా మేనేజర్ రవీందర్‌రెడ్డి ఆక్షన్ పెట్టి అమ్మేసాడన్న విషయాన్ని గోపాల్ తెలుసుకున్నాడు. తనకు తెలియకుండా దాన్ని అమ్మడమేగాక, బినామీల పేరిట ఆ బంగారాన్ని కొనిపించి వినీలకు కానుకగా ఇచ్చినట్టు కూడా తెలుసుకున్నాడు గోపాల్. ఈ విషయాన్ని బ్యాంకు ఉన్నతాధికారులకు ఫిర్యాదు చేస్తానని, వడ్డీ కట్టినా ఎలా వేలం వేస్తారంటూ గొడవ పడ్డాడు. దాంతో మేనేజర్ కంగారుపడ్డాడు. తన ఉద్యోగం పోతుందని ఆందోళన చెందాడు. వినీలతో సమాలోచనలు జరిపాడు. గోపాల్ బతికుంటే తమ బండారం బయటపడుతుందని భావించి అతడి పీడ వదిలించుకోవాలనుకున్నారు.

గోపాల్‌ను చంపడానికి పాతబస్తీకి చెందిన కిరాయి హంతకముఠాకు పది లక్షలిచ్చి ఒప్పందం కుదుర్చుకున్నాడు బ్యాంక్ మేనేజర్ రవీందర్‌రెడ్డి. ప్లాన్ రెడీ అయింది.

దీపావళి ముందు రోజు నేరుగా గోపాల్ ఇంటికి వెళ్లి అక్కడ పరిస్థితిని చూసి సిగ్నల్ ఇస్తానని చెప్పింది వినీల. అయితే టెర్రస్‌పైన గోపాల్‌తో పాటు పిల్లలు ఉండడంతో ఆ విషయాన్ని ఫోన్‌లో హంతకముఠాకు తెలియజేసింది. ఏదో ఒకటి చెప్పి పిల్లల్ని అక్కడి నుంచి తీసుకెళ్లమని గ్యాంగ్‌లీడర్ చెప్పడంతో వినీల తిరిగి పైకి వెళ్లి గోపాల్‌ను నేరుగా కలిసింది. 'బంగారం విషయం మాట్లాడుకుందాం. పిల్లలు వినడం ఎందుకు? వారిని పంపిస్తాన'ని అంటూ పిల్లల్ని కిందకు తీసుకెళ్లింది. ఆపై 'రూట్ క్లియర్' అంటూ ముఠానాయకుడికి ఎస్సెమ్మెస్ ఇచ్చింది.

అప్పటికే అదనుకోసం ఎదురుచూస్తున్న హంతక ముఠా ముందు గోపాల్‌పై కాల్పులు జరిపింది. బుల్లెట్‌లు అతనికి తగలకపోవడంతో వెంట తెచ్చుకున్న కత్తులతో విచక్షణారహితంగా పొడిచి పారిపోయారు.

"ఆడవాళ్ల అవసరాలను తమకు అనుకూలంగా మలుచుకునే బ్యాంక్ మేనేజర్‌లాంటి వాళ్లు ఈ సమాజంలో చాలామందే ఉన్నారు. అలాంటివారిపట్ల మహిళలు అప్రమత్తంగా ఉండాలి. లేదంటే వినీలలాగా కటకటాలపాలవ్వడం ఖాయం" అన్నారు కేసును పర్యవేక్షించిన రాచకొండ పోలీస్ కమిషనర్ మహేష్ మురళీధర్ భగవత్.

**- వేములు సత్యనారాయణ, 9985488800**

## సిక్స్ వే ఓపెనర్
### (6 way opener)

బాటిల్ మూతలు బిగిసిపోయినప్పుడు తెరవడానికి నానా ఇబ్బందులు పడాల్సివస్తుంది. కొన్నిసార్లు ఎంత ప్రయత్నించినా చెయ్యి జారిపోయి, గాజు బాటిల్స్ అయితే కిందపడి పగిలిపోయే ప్రమాదం కూడా ఉంటుంది. ఈ 'సిక్స్ వే ఓపెనర్'తో ఆ ఇబ్బందులన్నీ తొలగిపోతాయి. అన్ని రకాల మూతలను తెరిచేందుకు వీలుగా దీన్ని తయారుచేశారు. ప్లాస్టిక్ మూతలు మాత్రమే కాకుండా టిన్స్, బీర్ బాటిల్స్, పచ్చడి డబ్బాలను తెరిచేందుకు కూడా ఈ ఓపెనర్ బాగా ఉపయోగపడుతుంది.





ఇంటెక్

# ఈజీ కుకింగ్ గాడ్జెట్స్

ఈ వస్తువులను వాటి పేరుతో నెట్‌లో సెర్చ్ చేసి, వివిధ ఆన్‌లైన్ సంస్థల ద్వారా కొనుగోలు చేయవచ్చు.

## డ్రాప్ స్కేల్
### (Drop Scale)




అవసరమైన పదార్థాలు సరైన మోతాదులో పడితేనే కూర రుచిగా ఉంటుంది. ముఖ్యంగా ఉప్పు కారం కొంచెం ఎక్కువైనా, తక్కువైనా టేస్ట్ బాగోదు. పుస్తకాల్లో, ఆన్‌లైన్‌లో చూసి వంటలు చేసేవారికి పదార్థాలను వాళ్లు చెప్పిన మోతాదులో కొలవడం కష్టమవుతుంది. ఆ పనిని అతి సులభతరం చేసేస్తుంది ఈ 'డ్రాప్ స్కేల్'. తయారు చేయబోయే వంట గురించిన సమాచారం యాప్‌లో ఎక్కిస్తే, తీసుకునే పదార్థాలు సరైన మోతాదులో ఉన్నాయో లేవో స్మార్ట్‌ఫోన్‌లో, ట్యాబ్‌లో చూపిస్తుంది. అంతేకాకుండా పదార్థాల బరువును మిల్లీగ్రాములతో సహా కొలిచేందుకు కూడా ఈ గాడ్జెట్ ఉపయోగపడుతుంది.




## మెల్డ్ నాబ్ (meld knob)






స్టవ్‌పైన పాలు పెట్టి మరిచిపోవడం, అవి పొంగిపోయి పొయ్యి మొత్తం తుడవాల్సి వాడడం, హాల్‌లోకి వెళ్లొచ్చే లోపు కూర మొత్తం మాడిపోవడం, టీవీ చూస్తూ స్టవ్ పైన అన్నం పెట్టిన సంగతి మరిచిపోతే అది ఉడికి ఉడికి మెత్తగా అయిపోవడం లాంటివి ప్రతి ఇంట్లోనూ అప్పుడప్పుడూ కనిపించే దృశ్యాలే. ఇలాంటి ఇబ్బందులను దూరం చేస్తుంది ఈ 'మెల్డ్ నాబ్'. దీనికి ఉండే హోల్డర్‌ను గిన్నెకి తగిలించి, ఒక సమయాన్ని నిర్దేశిస్తే ఆ సమయం గడిచాక అది ఆటోమెటిక్‌గా కంట్రోలర్ ద్వారా స్టవ్‌ను ఆఫ్ చేసేస్తుంది. పాలు పొంగిపోతాయని, కూరలు మాడిపోతాయనే కంగారుని దూరం చేసేందుకు బాగా ఉపయోగపడుతుంది ఈ గాడ్జెట్.




## రోలీ ఎగ్ మాస్టర్
### (rollie-eggmaster)




పిల్లలు పిజ్జా, బర్గర్‌లతో సమానంగా రోల్స్‌ను ఇష్టపడతారు. అయితే బేకరీలలో దొరికేంత రుచిగా ఇంట్లో రోల్స్ చేయడం చాలా కష్టం. 'రోలీ ఎగ్ మాస్టర్' ఉంటే ఇంట్లోనే రుచికరమైన రోల్స్‌ను తేలికగా తయారుచేసుకోవచ్చట. ముఖ్యంగా కోడిగుడ్లతో రోల్స్ (ఎగ్ రోల్స్) చేసేందుకు దీన్ని తయారుచేసారు. గుడ్లను పగులకొట్టి దీంట్లో పోస్తే పచ్చసొన మధ్యలోకి వెళ్లి చుట్టూరా తెల్లసొనతో చూడగానే నోరూరించేలా రోల్స్ తయారవుతాయి. ఉడికిన తర్వాత రోల్ ఆటోమెటిక్‌గా పైకి వచ్చేస్తుంది. కేవలం ఎగ్ రోల్స్ మాత్రమే కాకుండా అన్ని రకాల రోల్స్ తయారుచేసేందుకు కూడా ఈ గాడ్జెట్ ఉపయోగపడుతుంది.

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## అర్టికేరియా సమస్యకు సరైన వైద్యం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రపంచ వ్యాప్తంగా ఎంతోమంది ఎన్నో రకాల చర్మ సమస్యలతో బాధపడుతుంటారు. అలాంటి వాటిలో అర్టికేరియా ఒకటి. దీనినే 'హీవ్స్' అని కూడా అంటారు. ఒక్కసారిగా ఉన్నట్లుండి చర్మంపై దద్దుర్లు ఏర్పడటం, వీటి వలన విపరీతమైన దురద వంటి లక్షణాలు కనిపిస్తాయి. అవి కొన్ని నిమిషాల నుండి కొన్ని గంటల వరకు కనబడి, తదుపరి పూర్తిగా కనిపించకుండా పోవడం వంటి లక్షణాలన్నీ అర్టికేరియా వ్యాధికి సంబంధించినవే. మరికొందరిలో ఇవి దీర్ఘకాలికంగా కొనసాగి, తీవ్ర ఇబ్బందులకు గురి చేస్తాయి.

ఈ అర్టికేరియా సమస్య కొన్ని ఇతర చర్మసమస్యల మాదిరిగానే కనిపించడం వలన - కొన్ని సార్లు నిర్లక్ష్యానికి గురి అయి ప్రమాదకరంగా మారే అవకాశం ఉంటుంది. ఇతర వైద్య విధానాల ద్వారా ఈ వ్యాధిని కేవలం నియంత్రించవచ్చు. కానీ హోమియో చికిత్స ద్వారా ఈ వ్యాధి నుండి పూర్తిగా బయటపడే అవకాశం ఉంటుంది. కాబట్టి ఈ అర్టికేరియా వ్యాధి పట్ల అవగాహన పెంచుకుని, దీనిని మొదట్లోనే గుర్తించి, వెంటనే సరైన చికిత్స అందించినట్లయితే ఈ వ్యాధి బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు. అర్టికేరియా అనేది సాధారణంగా కనిపించే చర్మ సమస్య. సుమారు 20% మంది ప్రజలు తమ జీవితకాలంలో ఏదో ఒక సందర్భంలో ఈ వ్యాధి బారిన పడటం జరుగుతుంది. ఏ వయస్సు వారినైనా ఇది ప్రభావితం చేస్తుంది. ఈ అర్టికేరియా ప్రభావం స్త్రీ, పురుషులలో సమాన స్థాయిలో ఉంటుంది.



**అర్టికేరియా 2 రకాలు:** **(1) అక్యూట్ అర్టికేరియా:** అర్టికేరియా వ్యాధి లక్షణాలు 6 వారాల కంటే తక్కువ రోజులు కనిపించినట్లయితే దానిని అక్యూట్ అర్టికేరియా అని అంటారు. ఇది అర్టికేరియా వ్యాధిని ప్రేరేపించే అంశాలు ఎదురైనప్పుడు కలుగుతుంది. **(2) క్రానిక్ అర్టికేరియా:** అర్టికేరియా సమస్య 6 వారాలకు మించి కొనసాగినట్లయితే దానిని క్రానిక్ అర్టికేరియా అంటారు. ఈ సమస్యకు గల ఖచ్చితమైన కారణాల పరంగా ఇంతవరకూ స్పష్టత లభించలేదు. కానీ మన శరీరంలో అంతర్లీనంగా ఉండే వివిధ ఆరోగ్య సమస్యలు - ముఖ్యంగా థైరాయిడ్, లూపస్ మొదలైన వాటి వలన అర్టికేరియా ఉత్పన్నమయ్యే అవకాశాలు ఉంటాయి.

**కారణాలు:** మన శరీరానికి సరిపడని పదార్థాలు - శరీరంలోకి ప్రవేశించినప్పుడు వాటికి ప్రతిస్పందనగా చర్మంలో శోథమును కలిగించే ప్రక్రియ ద్వారా కొన్ని కణాలు - హిస్టమిన్ మరియు ఇతర కెమికల్స్ రక్తప్రసరణలోకి విడుదల అవడం వలన అర్టికేరియా ఏర్పడుతుంది. ఇంతే కాకుండా కొన్ని ఆటోఇమ్యూన్ వ్యాధుల వలన కూడా అర్టికేరియా సమస్య ఉత్పన్నమవుతుంది. **'అర్టికేరియా'ను ప్రేరేపించే అంశాలు:** నొప్పి నివారణ మందులు • కీటకాలు, పరాన్నజీవులు • ఇన్‌ఫెక్షన్‌లకు కారణమయ్యే 'బ్యాక్టీరియా' మరియు 'వైరస్'లు • అధిక ఒత్తిడి, సూర్యకాంతి, వ్యాయామం, గోకడం వంటి చర్యలు • మద్యపానం మరియు కొన్ని ఆహార పదార్థాలు • అధిక లేదా అల్ప ఉష్ణోగ్రతలకు గురికావడం • జంతుకేశాలు, పుప్పొడి రేణువులు వంటి అంశాలన్నీ అర్టికేరియాను ప్రేరేపిస్తాయి.

**లక్షణాలు:** చర్మంపై ఎరుపు లేదా చర్మపు రంగులో దద్దుర్లు ఏర్పడతాయి. • ఇవి విపరీతమైన దురదతో కూడి ఉంటాయి. • ఈ దద్దుర్లు నొప్పి లేదా మంటను కలిగి ఉంటాయి (Angioedema) • ఇవి కళ్ళ చుట్టూ, బుగ్గలపై, పాదాలు, చేతులు, పెదాలపై ఏర్పడతాయి. ముఖ్యంగా ఇవి గొంతులో ఏర్పడితే - ఈ వాపు వాయుద్వారాలకు అడ్డుగా మారే పరిస్థితి ఒక్కోసారి ప్రాణాంతకంగా మారవచ్చు.• ఈ దద్దుర్ల పరిమాణం పెరగటం-తరగటం మరియు వీటిని ప్రేరేపించే అంశాలకు గురి అయినప్పుడు ఆ తేడా కనిపించటం తదుపరి అదృశ్యమవటం జరుగుతుంది. • ఈ దద్దుర్లపై ఒత్తిడి పడితే ఇవి తెల్లగా మారడం వంటి లక్షణాలను మనం గమనించవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** అక్యూట్ అర్టికేరియా నిర్ధారణకు సాధారణంగా ఎలాంటి వ్యాధి నిర్ధారణ పరీక్షల అవసరం ఉండదు. దీర్ఘకాలిక మరియు తరచూ పునరావృతమయ్యే అర్టికేరియాకు అవసరమయ్యే నిర్ధారణ పరీక్షలు: CBP, ESR, థైరాయిడ్ స్టిమ్యులేటింగ్ హార్మోన్ (TSH) మరియు యాంటీ న్యూక్లియర్ యాంటీబాడీస్ ANA మొదలైనవి. • అర్టికేరియల్ వాస్క్యులైటిస్‌ను నిర్ధారించుకునేందుకై పంచ్ బయాప్సీ పరీక్షను కూడా చేయించవలసి ఉంటుంది.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** కాన్‌స్టిట్యూషనల్ హోమియోపతిలో భాగంగా, సూక్ష్మీకరణ పద్ధతిలో తయారైన హోమియో మందులతో, రోగి శరీర రోగనిరోధక కణాలకు పునరుజ్జీవం కల్పించి, ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా 'అర్టికేరియా' సమస్యను పూర్తిగా నయం చేయటం జరుగుతుంది. కేవలం హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే లభించే ఈ విశిష్ట వైద్యరీతిలో వ్యాధి రీత్యా రోగి శరీర నిర్మాణం, వ్యక్తిగత మరియు మానసిక లక్షణాల పరిశీలన తదుపరి మాత్రమే అందించే చికిత్సతో 'అర్టికేరియా'ను పూర్తిగా నయం చేయవచ్చు.

## చుక్కలు కలపండి





## ఊసరవెల్లి చేప

ఆక్టోపస్‌కి అన్నలా కనిపిస్తోన్న ఈ కటిల్ (Cuttle) ఫిష్ ఆ జాతికి చెందినదే! కాకపోతే ఆక్టోపస్‌కి నాలుగు జతల చేతులుంటే... దీనికి ఒక జత మాత్రమే ఉంటాయి. కళ్లు పెద్దవిగా ఉంటాయి. ఒంటిపై అందమైన చారలుంటాయి. సముద్ర జీవుల్లో చాలావాటికి పెంకు బయట ఉంటే దీనికి మాత్రం శరీరం లోపల ఉంటుంది. దాన్ని కటిల్‌బోన్ అని పిలుస్తారు. ఆడ కటిల్‌ఫిష్‌ని ఆకర్షించడానికి, శత్రువు నుంచి కాపాడుకోవడానికి ఇది తన ఒంటి రంగును, డిజైన్లను మార్చగలదు. తనకంటే చిన్నవైన రొయ్యలు, చేపలు, స్క్విడ్‌లు దీనికి ఆహారం.

### మీకు తెలుసా!



- ఫిలడెల్ఫియాలో పిజ్జా రుచి ఉండే ఐస్‌క్రీమ్ అమ్ముతారు.
- పాములు గాజు ఉపరితలంపై పాకలేవు.
- శిక్షణ ఇస్తే తేనెటీగలు పేలుడు పదార్థాలను కనిపెట్టగలవు.
- నీలి తిమింగలాలు డైనోసార్ల కంటే పెద్దవి.
- ఆఫ్రికాలో ఎగసే దుమ్ము రేణువులు అమెరికాలోని ఫ్లోరిడా వరకూ ప్రయాణించగలవు.

## బేతాళ ప్రశ్న - 12



ప్రవీణ, ప్రదీప్‌తో కలిసి షాపింగ్‌కు వెళ్లింది. అక్కడ ఒక స్నేహితురాలు కనిపించి ప్రవీణని "ఇతనెవరు?" అని అడిగింది. దానికి ప్రవీణ "వీళ్ల మామకు మామ, మా మామ మామకు మామ" అని సమాధానం చెప్పింది. ఇంతకూ ప్రవీణకు ప్రదీప్ ఏమవుతాడు?

**సమాధానం వచ్చేవారం!**

**మీ దగ్గర ఇలాంటి మెదడుకు మేతవేసే ప్రశ్నలు, భేతాళ ప్రశ్నలు ఉంటే సమాధానంతో పాటు మా ఈమెయిల్ kerintha.aj@gmail.com కు పంపించగలరు**

**గతవారం సమాధానం:** ఐశ్వర్యకు వచ్చే మొత్తం చాక్లెట్లు 22. 15 రూపాయలతో 15 చాక్లెట్లు కొంటుంది. వాటి రేపర్స్‌ను తిరిగి ఇస్తే 3 రేపర్స్‌కు ఒక చాక్లెట్ చొప్పున మళ్లీ 5 చాక్లెట్లు వస్తాయి. వాటిలో 3 రేపర్స్ తిరిగి ఇస్తే ఇంకో చాక్లెట్ వస్తుంది. ఆ చాక్లెట్ రేపర్, ఇంతకు ముందున్న 2 చాక్లెట్ రేపర్స్‌తో కలిపితే ఐశ్వర్యకు మరో చాక్లెట్ వస్తుంది. మొత్తం 15+5+1+1= 22.

**బేతాళ ప్రశ్న- 10 కి సరైన సమాధానం పంపిన మొదటి ముగ్గురు:** **కె. ఝాన్సీ**, విశాఖపట్నం, **చిరమన వెంకట రమణయ్య**, నెల్లూరు **జి.ఎస్. శ్రీకాంత్**, ఈమెయిల్

ఇంగ్లీషులో డోవ్ (Dove), పీజియన్(Pigeon) అనే 2 పదాలకు అర్థం పావురమనే. మరి ఈ రెండింటికి ఏంటి తేడా అంటే మనం శాంతికి చిహ్నంగా భావించే తెల్ల పావురాన్ని 'డోవ్' అంటారు. వేరే రంగులో ఉన్న పావురాన్ని పీజియన్ అంటారు. శరీర నిర్మాణానికి సంబంధించి కూడా వీటి మధ్య కొన్ని తేడాలున్నాయి.

## స్కిప్పింగ్‌లో గిన్నిస్

తాడాట మంచి వ్యాయామ క్రీడ. చాలామంది ఆడతారు. కానీ ఒక నిమిషంలో వందకు మించి ఆడటమంటే ఎంతో ప్రాక్టీస్ ఉంటే తప్ప సాధ్యం కాదు. అనికా స్తుర్ అనే జర్మన్ అమ్మాయి చక్కగా నేల మీద కూర్చుని, రెండు కాళ్లూ చాపుకుని తాడాట ఆడుతుంది. ఇదే కష్టమనుకుంటే నిమిషానికి నూట ఎనిమిది రౌండ్లు పూర్తి చేసి గిన్నిస్ రికార్డులకెక్కింది.




## పంచరంగుల నది

ఆకాశంలోని ఇంద్రధనుస్సు నీటిలో కరిగిపోయి పంచరంగుల నదిగా ఏర్పడిందేమో అనిపిస్తుంది 'కేనో క్రిస్టల్స్' నదిని చూసినపుడు. కొలంబియా దేశంలోని మెటా డిపార్ట్‌మెంట్ అనే ప్రాంతం జలపాతాలు, ఉరకలెత్తే నదీపాయలు, బుగ్గబావులు, లోయలతో నిండి ఉంటుంది. వాటన్నిటినీ ఒరుసుకుని ప్రవహించే ఈ నదిలో నీరు చాలా పరిశుభ్రంగా ఉంటుంది. నీళ్లు ఎంత లోతుగా ఉన్నా... అడుగు భాగం స్పష్టంగా కనిపిస్తుంది. అయితే రాళ్లపై పేరుకున్న పచ్చని నాచు సెప్టెంబర్, నవంబర్ నెలల్లో ఉష్ణోగ్రతల్లో వచ్చే మార్పుల వల్ల పంచరంగులను సృష్టిస్తుంది. అందుకే ఆ సమయంలో ఎరుపు, ఆకుపచ్చ, నీలం, పసుపు, నలుపు రంగుల్లో నది తళుకులీనుతుంది. అందుకే దీన్ని రెయిన్‌బో నదిగా వ్యవహరిస్తుంటారు. ఈ నదిని చూడాలంటే కాలినడకన గానీ, గుర్రాలపై గానీ వెళ్లాల్సి ఉంటుంది. స్థానికులు ఈ నదిని స్వర్గలోక నదిగా పిలుస్తారు.



## రంగులు వేయండి






## దారి కనుక్కోండి





**సాధారణంగా దుబాయ్ అనగానే గుర్తొచ్చేవి ప్రపంచంలోనే ఎత్తైన బుర్జ్ ఖలీఫా, షాపింగ్ మాల్‌లు, బంగారం కొనుగోళ్లు, డెసర్ట్ సఫారీలో ప్రయాణాలు. ఇవే కాకుండా సాహస ప్రియులకు ఉత్తేజం కలగజేసే మరెన్నో అద్భుతాలు సృష్టించి పర్యాటకులను ఆకర్షిస్తోంది దుబాయ్. ఒక వ్యాపార సదస్సు కోసం నేను, నా స్నేహితుడు మధు కలిసి ఆ దేశం వెళ్లినపుడు అక్కడ వారం రోజులు పర్యటించే అవకాశం కలిగింది. ఎటువంటి ప్యాకేజ్‌లు, గైడ్‌లు లేకుండా మామూలు ప్రజా రవాణా వ్యవస్థ (బస్సులు, మెట్రో రైలు లేదా ట్యాక్సీ) ద్వారా తిరిగి చూసొచ్చాం.**

## దుబాయ్ సాహస క్రీడలు

# మంచులో.. నీళ్లలో.. గాలిలో ...

ఆరువందలకి పైగా వ్యాపార కార్యకలాపాలు, వందకు పైగా హోటళ్లు, 15 సినిమా స్క్రీన్‌లతో ఉన్న అతి పెద్ద మాల్ 'మాల్ ఆఫ్ ఎమిరేట్స్'. అందులో ఉన్న మరో ప్రత్యేక ఆకర్షణ కృతిమ మంచు ప్రపంచం 'స్కీ దుబాయ్'. దాదాపు ఆరు ఎకరాల విస్తీర్ణంలోని ఆ ప్రదేశం అందరూ తప్పకుండా చూడదగినది. చలిని తట్టుకునే దుస్తులు, స్కీయింగ్ పరికరాలు అన్నీ ముందే ఇచ్చారు. మంచు పర్యాటక ప్రాంతాలలో ఉండే క్రీడలు, వినోదాలు అన్నీ అక్కడ అనుభూతి పొందవచ్చు. మంచులో విహరించే రోప్ వే, కృత్రిమంగా సృష్టించిన 85 మీటర్ల ఎత్తయిన మంచు పర్వతం నుండి స్కీయింగ్, స్నో బోర్డింగ్, స్నో బులెట్ వంటివన్నీ ఉన్నాయక్కడ. 3000 చదరపు మీటర్ల మంచు గుహలో విహరించడం



మాల్ ఆఫ్ ఎమిరేట్స్ లో...

మాకు చాలా ఆనందం కలిగించింది. పెంగ్విన్ పక్షులు కూడా ఉండడం మరో విశేషం. వాటితో ఆడుకోవడం, ఫోటోలు దిగడం అన్నీ చేయొచ్చు. వేడి వేడి చాకోలెట్, ఇతర ఆహార పదార్థాలు అందించే హోటల్ కూడా దాని లోపలే ఉంది. దుబాయ్ వంటి వేడి ప్రదేశంలో 60 వేల టన్నుల మంచును సృష్టించడమనేది నిజంగా ఒక అద్భుతమే.

### సముద్రం మధ్యలో ఉన్న అనుభూతి

ఆ మర్నాడు పామ్ జుమేరాకి వెళ్ళాం. సముద్రంలో ఖర్జూర చెట్టు ఆకారంలో నిర్మించబడిన కృత్రిమ దీవుల సముదాయం అది. అక్కడికి వెళ్లడానికి సముద్రం మీదుగా నిర్మించిన మోనో రైల్ కనెక్టివిటీ ఉంది. ఆ దీవుల మధ్యలో ప్రపంచంలోనే అత్యంత విలాసవంతమైన అట్లాంటిస్ హోటల్‌ని నిర్మించారు. పామ్ అట్లాంటిస్ హోటల్‌లోని వాటర్ పార్క్, డాల్ఫిన్ బేలను చూసి మన దగ్గర కూడా ఇలాంటివి చాలానే ఉన్నాయి కదా, మళ్లీ ఇక్కడ చూసేదేముంది అని మొదట అనుకున్నాం కానీ తర్వాత మాత్రం వెళ్లి ఉండకపోతే ఎంత కోల్పోయేవాళ్ళమో అనిపించింది. ఆ అనుభవాలు మనం ఇంకో చోట పొందలేము. ముందుగా నీటి బుగ్గ పైన కూర్చొని కిందికి జారే రైడ్ ఎక్కాము. పైనుండి కొంత జారిన తర్వాత ఒక సొరంగంలోకి వెళ్ళాం. అంతా మూసుకుపోయి ఉంది. కొన్ని సెకన్ల తర్వాత చూస్తే చుట్టూ నీళ్ళే! ఆ నీళ్లలో తేలుతూ, ఊగుతూ, ముందుగు సాగుతూ ... మా చుట్టూ తిరుగుతున్న చేపలు, షార్కులు .. సముద్రం మధ్యలో ఉన్న అనుభవం. అక్వేరియమ్ మధ్యలో మనం ఉండి చుట్టూ ఉన్న చేపల్ని చూస్తున్నట్టుగా అనిపించింది.

అక్కడున్న మరో ప్రత్యేకత డాల్ఫిన్స్‌తో ఏకాంతంగా గడిపే

అవకాశం. సింగపూర్ వంటి చోట్ల డాల్ఫిన్ షోలు ఉన్నాయి కానీ వాటితో సమయం గడిపే అవకాశం ఉండదు. ఇక్కడ ఈత వచ్చినా రాకపోయినా పిల్లలు, పెద్దలు పరిమిత లోతున్న నీటిలో డాల్ఫిన్స్‌ని పట్టుకొని ముద్దాడవచ్చు. డాల్ఫిన్స్ చాలా స్నేహంగా చిన్న పిల్లలలాగా మాతో ఆడుకున్నాయి. మా వెంట వచ్చిన గైడ్ డాల్ఫిన్ల విశేషాలు, వాటి మనస్తత్వం, మనం చేసే చర్యలకు వాటి ప్రతి చర్యలు వివరించారు. చాలా బాగా శిక్షణ పొందినట్టుగా అవి చెప్పిన విధంగా ఆడడం, ఎగరడం, ఈదడం, అడిగిన ప్రశ్నలకి చేతలతో సమాధానం తెలపడం ఎంతో అబ్బురమనిపించింది. నగరానికి తిరిగి వచ్చేటప్పుడు సముద్రం లోపలనుండి నిర్మించిన 6 లైన్ల రోడ్డుగల సొరంగ మార్గం ద్వారా వచ్చాం. రాత్రి పర్యాటకులు ఇష్టపడే దౌ క్రూజ్ డిన్నర్‌కి వెళ్ళాం. అక్కడ ప్రతి భోజనంలో కనబడే వంటకం 'హమ్మస్'. పచ్చి శనగలు రుబ్బి, థాని గింజెల పొడి, ఆలివ్ ఆయిల్, వెల్లుల్లిపాయలతో పేస్ట్ లాగా చేస్తారు. దీన్ని దుబాయ్ జాతీయ వంటకంగా పిలుస్తారు. అక్కడి వాతావరణ పరిస్థితులకు సరిపడే పోషక విలువలున్న వంటకం. దీనితో పాటు సాధారణంగా కనబడేది పీట రొట్టె.

## స్కై డైవింగ్ మరో అద్భుతం

దుబాయ్ వెళ్ళడానికి మరొక కారణం స్కై డైవింగ్. భూమి నుండి అత్యంత ఎత్తుకి విమానంలో వెళ్ళి ఎటువంటి పారాచూట్ లేకుండా దూకేసి భూమికి దగ్గరగా వచ్చే కొద్దిసేపటి ముందు పారాచూట్ విప్పి భద్రంగా నేలపై దిగడమే స్కై డైవింగ్. అత్యంత భద్రతా ప్రమాణాలను పాటించే అనుభవజ్ఞులైన సిబ్బంది ఉండడం వల్ల ఎటువంటి భయం లేకుండా డైవింగ్ చేసే వీలుంది. అక్కడ స్కై డైవింగ్ చేయడానికి అందుకే ప్రపంచం నలుమూలల నుంచి సాహస ప్రియులు వస్తుంటారు. అక్కడున్న స్నేహితుని సహాయంతో ముందుగానే బుక్ చేసుకున్నాము. గతంలో అనుభవం లేనప్పటికీ వారిచ్చే శిక్షణతో ఎటువంటి భయం లేకుండా చేయవచ్చని చెప్పారు.

ఆసక్తి, ఉత్సాహం ఉన్నా కొంత భయం కూడా ఉంటుంది కదా! దాదాపు 13 వేల అడుగుల ఎత్తు పైకి వెళ్ళిన తర్వాత సిద్ధంగా ఉండమని కోచ్ చెప్పారు. అక్కడి నుండి దుబాయ్ పట్టణం, సముద్రం, పామ్ జుమేర దీవులు, మేఘాల మధ్య నుండి చిన్నగా కనబడ్డాయి. అంత ఎత్తు నుండి గాలిలో అమాంతం దూకేయాలన్న ఊహ రాగానే ఒక క్షణం బాగా భయమేసింది. కానీ అనుభవం ఉన్న డైవర్ వెంట ఉన్నాడు కాబట్టి ధైర్యం తెచ్చుకొని అనుమతి రాగానే దూకేశాము.

దాదాపు రెండు నిమిషాల పాటు పారాచూట్ లేకుండా గాలిలో గంటకి 200 కిలో మీటర్ల వేగంతో కిందికి పడిపోవడం ఒక థ్రిల్లింగ్ అనుభవం. వ్యతిరేక దిశలో వేగంగా వచ్చే గాలి వేగానికి శరీరం ఒక రకమైన ఒత్తిడికి లోనైంది. కింద సముద్రం, పామ్ జుమేర దీవులు .. బొమ్మలా కనబడుతున్నాయి. అంత అందమైన దృశ్యం కనిపించడం వల్లనే కాబోలు ప్రపంచంలోని అన్ని స్కై డైవ్‌లలో ఇది ప్రథమ స్థానంలో ఉంది. కాసేపటి తర్వాత వెంట ఉన్న డైవర్ పారాచూట్ ఓపెన్ చేయడంతో పడిపోతున్న నన్ను ఎవరో


స్కీ దుబాయ్‌లో...

చటుక్కున పట్టుకున్నట్టుగా అనిపించింది. వేగం తగ్గి మెల్లగా కావలసిన చోటికి తిప్పాడు. నెమ్మదిగా ఆకాశంలో తిప్పుతూ అక్కడి నుండి కనబడుతున్న దృశ్యాల విశేషాలని వివరించి మళ్ళీ బయలుదేరిన చోటనే దింపాడు. సహాయకుడు తోడు ఉండగానే నాకు ఒళ్ళు గగుర్పాటు పొడిస్తే, నన్ను విస్తుపోయేలా చేసింది మా కెమెరామెన్ డేవిడ్. ఇతడు నా అనుభవాన్ని కెమెరాలో బంధించడానికి నాకంటే ముందు వెల్లకిలా కెమెరాతో దూకేసాడు. అంత ఎత్తులో, వ్యతిరేక దిశలో అంత వేగంగా వస్తున్న గాలికి నేను సర్దుకోడానికే వీలు దొరకకపోతే అతడు మాత్రం గాలిలోనే పొజిషన్స్ తీసుకుంటూ నాలుగు దిక్కులనుండి నావైపు చూస్తూ నాకు సూచనలిస్తూ, నన్ను మాట్లాడిస్తూ తన పని తాను చేసుకొని పారాచూట్ ఓపెన్ చేసుకొని నేను కిందికి చేరేలోపే అక్కడ ఉన్నాడు. ఆచరణ, నైపుణ్యం, ధైర్యం ఉంటే ఎంతటి ప్రమాదమైన, కష్టమైన పనైనా మనిషికి లోబడుతుందనే మాట చేయి తిరిగిన ఆ డైవర్స్‌ని చుస్తే నిజం అనిపించింది. సాహసం ఇష్టపడే ఔత్సాహికులకు ఒక మంచి అవకాశం అది.

## ఎడారిలో ప్రయాణం

మర్నాడు సాయంత్రం డెసర్ట్ సఫారీకి (ఎడారి ప్రయాణం) బయలుదేరాం. దుబాయ్ నుండి టయోటా ఫార్చ్యూనర్ వాహనంలో 70 కిలోమీటర్లు ప్రయాణించిన తర్వాత ఎడారిలోకి ప్రవేశించాం. దుబాయ్ మొత్తం అధునాతన నగరం అవడం వల్ల అరబ్బుల సంప్రదాయ ఇంటి నివాసాలు చూడలేక పోయినప్పటికీ నగరం నుండి దూరం వచ్చినప్పుడు చిన్న చిన్న ఊళ్లని చూడగలిగాం. ఎడారిలోకి ప్రవేశించే ముందు టైర్లలో కొంచం గాలి తీసేసాడు డ్రైవర్. గాలి నిండుగా ఉంటే బండి పైకి ఎగురుతుందట. మామూలు రోడ్ల పైన వెళ్ళే వాహనాలు ఎడారి


డెసర్ట్ సఫారీలో వ్యాస రచయిత

ప్రయాణానికి పనికి రావు. ఎక్కువ ఇంధన సామర్థ్యం, దృఢత్వం, అలాగే పెద్ద చక్రాలున్న బండ్లు మాత్రమే ఉపయోగపడతాయి. ఎత్తుపల్లాల వల్ల కలిగే కుదుపులకి శరీరం మొత్తం ఊగడం, ఎగరడం మరో కొత్త అనుభవం. వంకర్ల దగ్గర, ఎత్తు పల్లాల దగ్గర బండి ఏటవాలుగా ప్రయాణించడం, లోతులోకి వెళ్లడం, వెంటనే ఎత్తుకి ఎక్కడం, మట్టి చిమ్మడం వంటివన్నిట్నీ ఆసక్తిగా చూస్తూ కూర్చున్నాం. తర్వాత ముందే ఏర్పాటు చేయబడిన క్యాంపుకి తీసుకెళ్లాడు డ్రైవర్. అక్కడ ఎడారిలో వేగంగా ప్రయాణించే ఏ.టి.వి వాహనాలు అద్దెకు ఇస్తున్నారు. నేను, నా స్నేహితుడు వాటిని తీసుకుని నడిపాము. తర్వాత బెల్లి డాన్స్‌తోపాటు ఇతర అరబ్బు సంప్రదాయ నృత్యాలను చూసి తిరుగు ప్రయాణమయ్యాం.

20 సంవత్సరాల క్రితం కేవలం ఆయిల్ రాబడిపై మాత్రమే ఆధారపడిన ఆ చిన్న దేశం ఇప్పుడు ఎన్నో ప్రపంచ రికార్డులకు, మానవ నిర్మిత అద్భుతాలకు వేదికైనందుకు సంతోషం వేసింది. ఆ దేశ రాబడిలో అధికశాతం స్థిరాస్తి అభివృద్ధి, పర్యాటకం నుండే వస్తోంది. పాలకులకి మంచి దృష్టి, ప్రణాళిక, నిబద్ధత ఉంటే ఏ దేశమైనా అభివృద్ధి చెందగలదనడానికి దుబాయ్ ఒక మంచి ఉదాహరణ.

- మంచాల విశాల్, vishalmanchala@gmail.com



# ఎందుకు...?

## చలికాలంలో అరచేతులు చల్లన...?



చలికాలంలో మనం కొంతమంది చేతిలో చేయి వేసినపుడు ఆ చేతులు ఫ్రిజ్‌లోంచి బయటకు తీసినట్టు (అతిశయోక్తి కాదు సుమా) బాగా చల్లగా ఉంటాయి. అందుకు కారణం రక్త ప్రసరణ మందగించడం. కొంతమందిలో రక్త నాళాలు చాలా సున్నితంగా ఉంటాయి. వాతావరణం చల్లబడినపుడు రక్తనాళాలు కుంచించుకుపోవడం వల్ల రక్తప్రసరణ మందగిస్తుంది. ఒక్కోసారి రక్తం అరచేతులకు, పాదాలకు పూర్తిగా చేరకుండానే తిరిగి గుండెవైపు మళ్లిపోతుంది. దాని వల్లే అరచేతులు, పాదాలు చల్లగా ఉంటాయి.

## పై భాగంలోనే ఫ్రీజర్ ... ?



సులభంగా ఆవిరయ్యే ఫ్రియాన్ అనే ద్రవ పదార్థాన్ని రిఫ్రిజిరేటర్‌లో సన్నని తీగ చుట్టల ద్వారా ప్రవహింపజేస్తారు. ఈ ద్రవాన్ని 'రెఫ్రిజిరెంట్' అంటారు. ఇది ఫ్రిజ్‌లో ఉండే పదార్థాల వేడిని గ్రహించి ఆవిరిగా మారి చల్లదనాన్ని కలుగజేస్తుంది. ఆవిరిగా మారిన ఫ్రియాన్ ఫ్రిజ్‌లోని కండెన్సర్ ద్వారా పీడనానికి గురై మళ్లీ ద్రవంగా మారుతుంది. ఇది తిరిగి ద్రవరూపాన్ని పొందేటపుడు... అది అంతకు ముందు గ్రహించిన వేడి ఫ్రిజ్ వెనుక భాగం నుంచి బయటకు పోతుంది. ఆవిరిగా మారినపుడు ఫ్రియాన్ ఉష్ణోగ్రత ఎక్కువగానూ, దాని సాంద్రత తక్కువగా ఉండి అది ఫ్రిజ్ పైభాగానికి పయనిస్తుంది. ఈ ప్రక్రియ వల్ల ఫ్రిజ్‌లో చల్లదనం ఏర్పడి ఉష్ణోగ్రత అయిదు డిగ్రీల సెల్సియస్‌కు తగ్గుతుంది. అదే ఫ్రీజర్‌ను ఫ్రిజ్ అడుగు భాగంలో అమర్చితే అక్కడి ఉష్ణకిరణాలు పైపైపు ప్రయాణించి అంతకుముందు చల్లబడిన పదార్థాల ఉష్ణోగ్రత పెరుగుతుంది. అందువల్లనే ఫ్రీజర్‌ను పైభాగంలో అమరుస్తారు.

## దేని దారి దానిదే



"గుడ్ .. నీకు 90 శాతం అటెండెన్స్ ఉంది కదా ... బ్యాక్ లాగ్స్ లేకుండా చూసుకోవచ్చుగా .." సలహా ఇచ్చాడు లెక్చరర్.

"కుదరదు సార్ .. మందు కొట్టేవాడికి వైన్ షాపు లేనట్టు, సిగరెట్ తాగేవాడికి కిళ్లీ కొట్టు లేనట్టు ... నాకూ .." స్టూడెంట్ ఇంకా ఏదో చెప్పబోతుండగానే బుర్ర తిరిగి కిందపడ్డాడు లెక్చరర్.

## మంచమే కదా!

"నీ మీద బెంగతో అమ్మ మంచం పట్టిందిరా .."

"మంచమే కదా .. వదిలేయమనండి నాన్నా"

## అది పనంటారా?

"హలో .. పండూ, పనిలో ఉన్నావా?"

"లేదురా .. ఆటోలో ఉన్నా.. "

## మిక్స్చర్ పొట్లం

బొమ్మలు : వెంకట్

## పానకంలో పుడక



కాన్ఫరెన్స్ జరుగుతోంది.

"మన కంపెనీ లాస్‌లో ఉంది" బల్ల గుద్ది చెప్పాడు మేనేజర్.

అప్పుడే నీళ్లగ్లాసు తెచ్చిన ప్యూన్ మేనేజర్ చెవిలో ".. కాదు సార్, జూబ్లిహిల్స్‌లో ఉంది" గుసగుసగా చెప్పాడు.

## ఆత్మ దూరిందేమో!

"నిన్న నాకు ఒక మెసేజ్ వచ్చింది. అది చదివిన వెంటనే నా ఫోన్ స్విచ్ఛాఫ్ అయిపోయింది తెలుసా" చెప్పాడు శర్మ.

"ఆశ్చర్యంగా ఉందే .. ఆ మెసేజ్‌లో ఏముంది?" ఉత్సుకతతో అడిగాడు మూర్తి.

"బ్యాటరీ Low " చెప్పాడు శర్మ.

## బుర్రుండాలండీ!

"కంగ్రాట్స్ .. మీరు సెలక్ట య్యారు. మొదటి సంవత్సరం పాతిక వేలిస్తాం. రెండో సంవత్సరం నుండి 40 వేలిస్తాం"

"థాంక్యూ సర్, నేను రెండో సంవత్సరం వచ్చి జాయినవుతా"

## హాహాకారాలు

"నీరు సలసల మరిగినప్పుడు ఒక శబ్దం వస్తుంది .. గమనించారా?" టీచర్.

"బహుశా బ్యాక్టీరియా ఆర్తనాదాలనుకుంటా సార్" స్టూడెంట్.

## బస్సు కొనలేదండీ!

"హలో ... సార్, ఈ రోజు నేను ఆఫీసుకు రాలేను. బైక్ పాడయింది"

"బస్సులో వచ్చేయ్"

"నాకు బస్సు లేదు సార్ .."

## తెల్లారిన తెలివి



"ఒక బుట్టలో 10 మామిడిపళ్లున్నాయి. అందులో 3 కుళ్లిపోయాయి. ఇప్పుడు చెప్పండి బుట్టలో ఎన్ని మామిడిపళ్లుంటాయి?"

"పదండి"

"అదెలా?"

"కుళ్లిపోయినంత మాత్రాన మామిడి పళ్ల మునగకాడలైపోవు కదండీ"

## ఛాయా 'చిత్రం'

- బ్నిం



అహనా చిల్లరంట... ఓహోనా చిల్లరంట...

అహనా చిల్లరంట... ఓహోనా చిల్లరంట...



పెద్ద నోట్లు చెల్లవంట...

బ్యాంకులంత గోలంట... టాం.. టాం.. టాం..

## దొంగల మధ్య రాయలేనండి



"పరీక్ష రాయకుండా ఏడుస్తూ కూర్చున్నావెందుకు బాబూ .. ఒంట్లో బాగోలేదా?" జాలిగా అడిగాడు ఇన్విజిలేటర్.

"అదేం లేదండి ... నేను రాత్రంతా కష్టపడి రాసుకొచ్చిన స్లిప్పుల్ని ఎవడో కొట్టేశాడండి .." బేరుమన్నాడు శేఖర్.

ఈ వారం కవిత

# హమెరికా ..హా'మెరికా'

ఆకురాలుకాలంలో
జాడతప్పి వచ్చిన కోయిల ఒంటరిపాట
కార్ల హోరుతో
వినికిడి కోల్పోయిన రోడ్ల మీద
తోడు దొరకని పాదాల నడక

కార్పొరేటు దాహాల పరుగు
కావలసిందేదో తెలియని
సమ్మోహ లాహిరి
అవసరాలను
రూపాయితో గుణించుకుంటున్న
డాలర్ల వినిమయ జాలం
ఇరుకు మనసుల ఇంపైన స్వర్గం
అంతరాత్మలను పోగొట్టుకున్న
వింతమనుషుల విస్మృత ప్రస్థానం
పొందుతున్న దానికీ
పోగొట్టుకున్న దానికీ మధ్య
పొంతన కుదరని గుంజాటన

వికాసంలేని వినోదం
విరామం లేని ప్రయాణం
నమ్మకంలేని రేపు కోసం
తలవంచుకున్న వర్తమానం



కలల వేటలో
గాయాలు మోస్తున్న మెలకువలు
చిరునవ్వులు పులుముకుంటున్న
డాంబికాల ఆడంబరాలు

ధరగల ఆకలిని కవ్విస్తున్న
పీనట్ బటర్‌పూతల డోనట్ రుచి
టర్కీ బర్గర్, మెక్సికన్ పిజ్జాల
టోస్టెడ్ హాయలు
బీఫ్ అండ్ బీర్ల కైపులో
విస్కీ వైన్‌ల 'హిప్‌హాప్' నాట్యం
ఊపులతో ఉడికించే 'టైమ్ స్క్వేర్' వయ్యారాల వల

రెండే రెండు వర్గాలు
అమ్మే వర్గం కొనే వర్గం
రెండే రెండు స్వర్గాలు
నేలనించి గాలిలోకి ఎగరేసేవీ
గాలిలో వేలాడదీసేవీ

పత్రహరితాన్ని తాకట్టుపెడుతూ
ఆకుపచ్చ అర్హత కోసం
వేర్లు విడిచిన మొల్ల తండ్లాట
అనుబంధాల వారసత్వం వదిలి
కొత్త పౌరసత్వం కోసం పాకులాట

బంధాలకు దూరం చేస్తున్న
అందాల అందలం అమెరికా
పాశాలను వదిలేసుకుంటున్న
ఆశల పరవశం అమెరికా

- వఝల శివకుమార్,
shivakumarvajjala@gmail.com



**మేషం : అశ్వని, భరణి, కృత్తిక 1వ పాదం**

ఆర్థికస్థితి సామాన్యం. రాబోయే ఆదాయానికి తగ్గట్టుగా ఖర్చులుంటాయి. కొత్త యత్నాలు ప్రారంభిస్తారు. అవకాశాలు అందినట్టే అంది చేజారిపోతుంటాయి. మంగళ, బుధ వారాల్లో లౌక్యంగా పనులు సాగక విసుగు చెందుతారు. దూరపు బంధువుల ఆహ్వానం అందుతుంది. ఆరోగ్యం సంతృప్తికరం. దంపతుల మధ్య దాపరికం తగదు. మీ ఇష్టాయిష్టాలను సున్నితంగా తెలియజేయండి. వ్యాపారాలు ఊపందుకుంటాయి. ఆకర్షణీయమైన పథకాలు రూపొందిస్తారు.



**వృషభం : కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

విమర్శలు, అభియోగాలకు దీటుగా స్పందిస్తారు. సమర్థతకు గుర్తింపు లభిస్తుంది. అవకాశాలను సద్వినియోగం చేసుకుంటారు. ధనలాభం, వస్త్రప్రాప్తి, ప్రశాంతత పొందుతారు. ఖర్చులు పెరిగినా ధనానికి ఇబ్బంది ఉండదు. అసాధ్యమనుకున్న పనులు తేలికగా పూర్తవుతాయి. ఆది, గురు వారాల్లో ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకోవలసి వస్తుంది. సంతానం ద్వారా శుభవార్తలు వింటారు. బంధువులతో సత్సంబంధాలు నెలకొంటాయి. వ్యాపారాభివృద్ధికి మరింతగా శ్రమించాలి.



**మిథునం : మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

సంతోషకరమైన వార్తలు వింటారు. ఆందోళన తొలుగుతుంది. విలాసాలకు వ్యయం చేస్తారు. పొదుపు పథకాలు లాభిస్తాయి. చిన్నారులకు విలువైన కానుకలందిస్తారు. మీ శ్రీమతి వైఖరిలో ఆశించిన మార్పు వస్తుంది. మంగళ, శని వారాల్లో పనులు హడావుడిగా సాగుతాయి. ప్రియతముల కలయిక అనుకూలించదు. అవివాహితుల్లో ఉత్సాహం నెలకొంటుంది. ఆరోగ్యం, సంతానం భవిష్యత్తు పట్ల మరింత శ్రద్ధ అవసరం.



**కర్కాటకం : పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

ఆదాయం సంతృప్తికరం. ఊహించిన ఖర్చులే ఉంటాయి. ధనానికి ఇబ్బంది ఉండదు. ఆత్మీయులకు సాయం అందిస్తారు. గురు, శుక్ర వారాల్లో పనులు ఒక పట్టాన పూర్తి కావు. ఆహ్వానాలు, నోటీసులు అందుకుంటారు. ప్రతి విషయంలోను అప్రమత్తంగా వ్యవహరించాలి. చిన్న విషయమే వివాదమయ్యే ఆస్కారం ఉంది. మీ తప్పిదాలను సరిదిద్దుకోవటానికి యత్నించండి. దంపతుల మధ్య సఖ్యత నెలకొంటుంది.



**సింహం : మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

ఆర్థిక అంచనాలు ఫలిస్తాయి. రావలసిన ధనం అందుతుంది. ఖర్చులు విపరీతం. ముఖ్యులతో సంప్రదింపులు జరుపుతారు. మీ ప్రతిపాదనలకు గుర్తింపు లభిస్తుంది. గృహ నిర్మాణాలు వేగవంతమవుతాయి. ఆత్మీయులకు సాయం అందిస్తారు. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. ఆధ్యాత్మిక విషయాల పట్ల ఆసక్తి కలుగుతుంది. శనివారం నాడు నగదు, పత్రాలు జాగ్రత్త. పనుల సానుకూలతకు మరింతగా శ్రమించాలి. ఉద్యోగ యత్నంలో నిరుత్సాహం వీడండి. త్వరలో మీ కృషి ఫలిస్తుంది.



**కన్య : ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

ఈ వారం ప్రశాంతంగా గడుస్తుంది. ఆశలొదిలేసుకున్న బాకీలు వసూలవుతాయి. ఖర్చులు అధికం, ప్రయోజనకరం. స్వచ్ఛంద సంస్థలకు సహాయం అందిస్తారు. గృహంలో ప్రశాంతత నెలకొంటుంది. ఆహ్వానాలు అందుకుంటారు. పనులు, బాధ్యతలు ఇతరులకు అప్పగించవద్దు. వ్యవహారాలు మీ చేతుల మీదుగా సాగుతాయి. మీ ప్రతిపాదనలకు ఆమోదం లభిస్తుంది. వ్యతిరేకులను సైతం ఆకట్టుకుంటారు. వస్త్ర, ఫ్యాన్సీ, పచారీ వ్యాపారాలు ఊపందుకుంటాయి.

# అనుగ్రహం

**27 నవంబర్ - 3 డిసెంబర్ 2016**

డాక్టర్ పి.ఎ.రామన్



**తుల : చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

వేడుకలు, శుభకార్యంలో పాల్గొంటారు. బంధువుల ఆదరణ సంతృప్తినిస్తుంది. విలువైన కానుకలు చదివించుకుంటారు. ఆర్థిక అంచనాలు ఫలిస్తాయి. ఖర్చులు భారమనిపించవు. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. దాంపత్య సౌఖ్యం, ప్రశాంతత పొందుతారు. సంప్రదింపులకు అనుకూలం. బాధ్యతలు అప్పగించవద్దు. పరిచయం లేని వారితో జాగ్రత్త. పనులు సకాలంలో పూర్తి కాగలవు. ఒక సమాచారం ఉత్సాహన్నిస్తుంది. వ్యాపారాలు ఊపందుకుంటాయి. ఆశించిన లాభాలు గడిస్తారు.



**వృశ్చికం : విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

సర్వత్రా అనుకూలతలుంటాయి. శ్రమకు తగిన ప్రతిఫలం అందుతుంది. రోజువారీ ఖర్చులే ఉంటాయి. పొదుపు పథకాల పట్ల ఆకర్షితులవుతారు. పెద్ద మొత్తం ధనసహాయం తగదు. ఆది, సోమ వారాల్లో పనుల సానుకూలతకు బాగా శ్రమించాలి. సంతానం భవిష్యత్తుపై శ్రద్ధ వహించండి. ఏ విషయాన్నీ తేలికగా తీసుకోవద్దు. మీ శ్రీమతి ఆరోగ్యం కుదుటపడుతుంది. బాధ్యతలు అప్పగించవద్దు. పరిచయం లేని వారితో జాగ్రత్త. ఉద్యోగ బాధ్యతల్లో మార్పులుంటాయి.



**ధనుస్సు : మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

నిర్దిష్ట ప్రణాళికలతో యత్నాలు ప్రారంభిస్తారు. అన్నీ అనుకున్న విధంగానే సాగుతాయి. పదవుల స్వీకరణకు అనుకూలం. కొత్త బాధ్యతలు చేపడతారు. గౌరవ ప్రతిష్టలు పెంపొందుతాయి. మంగళ, బుధ వారాల్లో స్తోమతకు మించి హామీలివ్వవద్దు. వాయిదా పడిన పనులు పూర్తి చేస్తారు. ఖర్చులు పెరిగినా ధనానికి ఇబ్బంది ఉండదు. మీ జోక్యంతో ఒక సమస్య సానుకూలమవుతుంది.



**మకరం : ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

కార్యసాధనకు అవిశ్రాంతంగా శ్రమిస్తారు. ఆదాయానికి తగ్గట్టుగా ఖర్చులుంటాయి. వ్యవహారాలు, బాధ్యతలు అప్పగించవద్దు. గురు, శుక్ర వారాల్లో పనుల ప్రారంభంలో ఆటంకాలెదుర్కొంటారు. కావలసిన వ్యక్తుల కలయిక అనుకూలించదు. దంపతుల మధ్య ఏకాభిప్రాయం నెలకొంటుంది. ఆరోగ్యం సంతృప్తికరం. సంతానం గురించి ఆందోళన చెందుతారు. సన్నిహితుల సాయంతో ఒక సమస్య సానుకూలమవుతుంది.



**కుంభం : ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

ఆలోచనలు నిలకడగా ఉండవు. చీటికిమాటికి అసహనం ప్రదర్శిస్తారు. కార్యసాధనకు ఓర్పు, పట్టుదల ప్రధానం ఆత్మీయుల రాకతో కుదుటపడతారు. రాబోయే ఆదాయానికి తగ్గట్టుగా ఖర్చులుంటాయి. శనివారం నాడు పనులు సాగక విసుగు చెందుతారు. పంతాలు, వాగ్వాదాలకు దిగవద్దు. కొన్ని విషయాలు చూసిచూడనట్టు వదిలేయండి. మీ శ్రీమతి సలహా పాటించటం శ్రేయస్కరం. సంతానం ద్వారా శుభవార్తలు వింటారు. ఆధ్యాత్మిక విషయాల పట్ల ఆసక్తి కలుగుతుంది.



**మీనం : పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

ఆర్థికంగా బాగుంటుంది. రుణ విముక్తులవుతారు. కొత్త రుణాలు మంజూరవుతాయి. ఆందోళన తగ్గి కుదుటపడతారు. విలువైన వస్తువులు, వాహనం అమర్చుకుంటారు. చెల్లింపులు, చెక్కుల జారీలో జాగ్రత్త. పనులు సకాలంలో పూర్తి కాగలవు. ఆది, సోమ వారాల్లో దంపతుల మధ్య అవగాహన, చికాకులు తలెత్తుతాయి. పెద్దలు మీ విషయంలో జోక్యం చేసుకోవలసి వస్తుంది. మీ గౌరవానికి భంగం కలుగకుండా మెలగండి. సంతానం భవిష్యత్తుపై మరింత శ్రద్ధ అవసరం.

## అవునా!




'ఈబే'లో ఇప్పటివరకూ అమ్మిన వస్తువుల్లో అత్యంత ఖరీదైంది - 168 మిలియన్ డాలర్ల విహారనౌక.

- Ketchup అసలు పేరు KeChiap. చైనావాళ్లు చేసుకునే మసాలా చేపల ఊరగాయ పేరు అది.

- ఇండియా, బంగ్లాదేశ్‌లిద్దరి జాతీయ గీతమూ బెంగాలీలో ఉండడమే కాక ఆ రెండు దేశాల జాతీయ జంతువూ ఒక్కటే - పులి.




మొదటిసారి ఓ అమెరికన్ అంతరిక్షంలో తిన్న ఆహారం ఆపిల్ సాస్.

- అంటార్కిటికాలో కూడా ఎటిఎం లున్నాయి. కాకపోతే రెండే.

- ఓ బ్రిటిష్ వెబ్‌సైట్ అంగారకుడిపై ఎకరం స్థలాన్ని 16 పౌండ్ల 75 పెన్నీలకు అమ్మింది.

- టిబెట్‌లోని బౌద్ధ ఆరామాలన్నిట్లోను దీపాలకు యాక్ (Yak) జంతువు నుండి తయారు చేసిన వెన్నను వాడతారు.



గబ్బిలాలు ఒక్కరాత్రి లోనే మూడువేల కీటకాలను స్వాహా చేయగలవు.

- మెల్‌బోర్న్ నగరాన్ని గతంలో Batmania అని పిలిచేవాళ్లు.

- మెదడు నుంచి నిర్దేశిత నాడులకు సమాచారం చేరే వేగం - గంటకు రెండొందల మైళ్లు.

# అదృష్ట రత్నజ్యోతి


## రమేశ్చంద్ర మహర్షి

సెల్ : 92465 82255, ఫోన్ : 040-6522 5554


**ఎస్.ఆర్.ఎస్., కరీంనగర్**

**నా భర్త జన్మకుండలి వివరించగలరు. ఉద్యోగం, కుటుంబం.**

ఈ జన్మకుండలి ప్రకారం-

1. విద్య ఇంజినీరింగ్, కుజ శని శుక్రుల వలన.

2. ఉద్యోగం ఆ రంగంలోనే. అయితే కేతువు వలన ఉద్యోగంలో అనేక మలుపులుంటాయి. అధిపతికి తృతీయంలో పడిన బృహస్పతి కంట్రోలింగ్ ఫేక్టర్. శని వయిపు కదులుతున్న కేతువు. ఉద్యోగంలో అనేకసార్లు మార్పులు. తన అసాధారణమైన ప్రతిభతో కంపెనీల తలరాతలే మార్చేయగల ధీ! కానీ ఒకచోట స్థిరంగా ఉండి వృద్ధిలోకి రానీయని తలరాత! ఇతరుల అసూయ. దీనికి తోడు 22 వయసు నుండి 28 మధ్య అస్తమిస్తున్న సూర్యుని దశ. షష్టమంలో పడి, పంచమం తాలూకు ఫలితాలు ఇస్తున్న చంద్రుడు కంట్రోలింగ్ ఫేక్టర్. 28 నుండి 38 మధ్య ఇదే చంద్రుని దశ. ఇక వృత్తిలో నిలకడ, స్థిరత్వం ఎక్కడుంటాయి. ఇదీ అని ఇతమిత్థంగా బోధపడని భవిత! భాగ్యం ఫలతి సర్వత్ర న విద్యా న చ పౌరుషమ్!



38 నుండి 45 మధ్య కుజ దశ. 38లో చేంజాఫ్ జాబ్. చేంజాఫ్ ప్లేస్. ఇక బృహస్పతి కారణంగా ఈ దశ అంతా వద్దంటే ప్రయాణాలు. ఉద్యోగంలో తీసివేతలూ గుణకారాలూ!

ప్రస్తుతం నడుస్తున్న ఉద్యోగంలోని అస్థిరత్వానికి పరిహారం, వెంటనే పగడాలు ధరించడం.

ఇక ఎప్పుడూ కూడా ఉద్యోగం చేసే రంగం మెడికల్ అయ్యేలా చూసుకోవాలి. దానిలోనే చేస్తారు... చేయాలి... చేయడం పరిహారం కూడా!

45 నుండి 63 వరకూ రాహు దశ. ఈ దశలో ఉద్యోగం విరమించి మెడికల్ ఫీల్డ్‌లోనే వ్యాపారం ప్రారంభించడం చేస్తారు. బాగుంటుంది. కానీ రాహువులో రాహువులో... అంటే 45 నుండి 48 మధ్య వ్యాపారంలో ఘోరంగా దెబ్బతినడం లేదా భార్యకు అనారోగ్యం అనే కోణాల్లో గట్టి పరిహారాలు పాటించి బయటపడాలి. శుక్రుని అనుగ్రహం వలన పరిహారాలు పనిచేస్తాయి.

48 వయసు నుండి ఇక వెనుతిరిగి చూసే పని ఉండదు.

ఇక వివాహం-

కారకో భావనాశాయ. ఈ సూత్రం పనిచేయకపోవడం సప్తమ శుక్రునికి బాగా వర్తిస్తుంటుంది. అధిపతీ కారకుడూ రెండూ ఆయనే ఇక్కడ. ఎంతో సుఖపడాలి అయితే... బుధుని స్థితి కూడదు. అస్తమిస్తున్న సూర్యుని స్థితి కూడదు. శని స్థితి కూడా కూడనిదే. శుక్రునికి షష్టమాధిపతి కంట్రోలింగ్ ఫేక్టర్, కుజుని వీక్షణ. రవి శనుల మధ్య బంధన యోగం. ఇంకేముంటుంది వైవాహిక జీవితంలో అన్యోన్యత. నిజానికి నాలుగు వివాహాలూ, రెండు విడాకులూ, రెండు సమాంతర వివాహాలూ అన్నట్టుగా ఉండాలి. అయితే అదృష్టవశాత్తూ, బృహస్పతి, ఈ జాతకుని పూర్వపుణ్యంతో ఈ అనర్థాలన్నీ జరగకుండా, వైవాహిక జీవితానికి ఎంతో కొంత అర్థం కలిగేలా సహకరిస్తాడు. రవి, శని కుజులకు పరిహారాలు పాటించడమే కాకుండా, భార్య ఉద్యోగం చేయడం కూడా అవసరమే. అంటే భార్య ఉద్యోగం చేయడం ఇక్కడ ఒకానొక రెమిడీ.

రవిలో శనిలో... అంటే 25వ ఏట వివాహం.

రవిలో శుక్రునిలో... 27లో సంతానం. పాప... రాహు చంద్రుల ప్రభావం వలన! సంతానం సంఖ్య రెండు. మొదట పాప, పిదప బాబు. ఇక్కడ విశేషం... అబ్బాయినివ్వవలసిన బృహస్పతి అమ్మాయినివ్వడం. అమ్మాయినివ్వవలసిన శుక్రుడు, రవి ప్రభావం వలన అబ్బాయి నివ్వడం!

అదృష్ట రత్నం : కనక పుష్యరాగం

అదృష్ట దిక్కు : వెస్ట్ ఫేసింగ్. అస్సలు కూడనిది సౌత్ ఫేసింగ్.

అదృష్ట సంఖ్య : 3, 9.

ఈ వారం కథ

# ఆనాటి చెలిమి ఒక కల

సాయి బ్రహ్మానందం గొర్తి

**ఇవాళ ఉదయం కొత్త ఆడీ కారు ఇంటికి తీసుకు రాగానే మా రెండోవాడి ఆనందానికి అవధుల్లేవు. మా పెద్దబ్బాయికి కార్ల మోజు అంతగా లేదు కానీ, మా రెండోవాడికి తెగ కార్ల పిచ్చి. ఆడీ కారు కొనమని సతాయించింది వాడే. ఇంటికి వచ్చీ రాగానే గబగబా తన రూమ్‌లోకి వెళ్ళి రివ్వున తిరిగొచ్చాడు. వాడి చేతిలో ప్లాస్టిక్ పేపరు కనిపిస్తే ఏమిటన్నట్లు చూశాను. కారు బంపర్ స్టిక్కర్! అది వాడు హవాయి వెళ్ళినప్పుడు కొన్నది. వద్దన్నట్లు తలాడించాను. చిన్నప్పుడు మా ఊళ్ళో రిక్షాలకీ, లారీలకీ వెనకాల 'తొందర పడకోయ్ సుందర వదనా!', 'బూరీ నజర్ వాలీ, తేరా ముహ్ కాలా!' అని హిందీలోనూ రాయడం గుర్తొచ్చింది.**

**"ప్లీజ్"** అంటూ బిక్క మొహం పెట్టేసరికి సరేనని, ఒక నెల వరకు ఉంచుతానని చెప్పాను. సరేనన్నాడు. వాడి చేతిలోంచి తీసుకొని విప్పి చూసాను.

ఆ స్టిక్కర్ చూడగానే మనసు ఒక్కసారి కలుక్కుమంది. ఆలోచనలు నా చిన్నతనం వైపు మళ్ళాయి.

హఠాత్తుగా రాజు గుర్తుకొచ్చాడు.

•••

ఇది ముప్పయ్యేళ్ళ నాటి సంగతి.

అప్పటికి నాకు సరిగ్గా పదిహేనేళ్ళు. అప్పుడే పదో తరగతిలోకి వచ్చాను.

మా క్లాసుకి వీరన్న అని ఒక కొత్త కుర్రాడు అంబాజీపేట స్కూల్ నుండి ట్రాన్స్‌ఫర్ అయ్యి వచ్చాడు. వీరన్న చదువులో అంతంత మాత్రమే అయినా బాల్ బాట్మింటన్ బాగా ఆడేవాడు. నాకు వాడితో బాగా స్నేహం అయ్యింది. వాడు నాకు బాట్మింటన్ ఆట నేర్పితే నేను వాడికి చదువులో సాయం చేసేవాణ్ణి.

స్నేహం పెరిగి వీరన్న కాస్తా వీరిగాడు అయ్యాడు.

వాళ్ళు ఊరు మొసలపల్లి. మా తాతగారి ఊరి పక్కనే. మాకక్కడ పొలాలు ఉండేవి. ప్రతీ నెలా నాన్న కొబ్బరి దింపుకి గంగలకుర్రు అగ్రహారం వెళ్ళమనేవాడు. ఎక్కువగా మా అన్నయ్యే వెళ్ళినా, వీరిగాడితో పరిచయం అయ్యాక నేనూ వెళ్ళడం మొదలుపెట్టాను. ఎందుకంటే పొలగుమ్మి హైస్కూల్లో బాట్మింటన్ ఆడుకోవచ్చని.

ఒకసారి అలా వెళ్ళినప్పుడు పరిచయం అయ్యాడు రాజు. నల్లగా, పొడుగ్గా మంచి శరీర దారుఢ్యం ఉండేది. చురుకైన కళ్ళూ, ఒత్తు జుట్టూ! ఒకసారి చూస్తే మర్చిపోం. ఎప్పుడూ తెల్లటి ఇస్త్రీ బట్టలు వేసుకుని మెరిసిపోతూ ఉండేవాడు.

రాజు వీరిగాడి బాబయ్య. మాకంటే పదేళ్ళు పెద్ద. చదువు అంతగా అబ్బలేదు. వీరిగాడి నాన్న రిక్షా నడిపేవాడు. అతని ఆరోగ్యం సన్నగిల్లడంతో ఆ పని రాజు మీద పడింది. అంబాజీపేటకీ బండార్లంకకీ మధ్య బాడుగ కట్టేవాడు. ఆ రిక్షాలు భలే ఉండేవి. వాటిని గూడు రిక్షాలు అనేవాళ్ళు. ఎత్తయిన సింహాసనం మీద కూర్చున్న భావన కలిగేది. ఓ చిన్న సైజు రథంలా అనిపించేది.

రాజులాగే అతని రిక్షా కూడా ఎప్పుడూ మెరుస్తూ కొత్త రిక్షాలా ఉండేది. రాజుకి శుభ్రం పాలు ఎక్కువ. మాటిమాటికీ తెగ తుడిచేవాడు. వర్షాకాలం వచ్చిందంటే చాలు, రోజంతా తుడవడంతోనే గడిచిపోయేది. ఎప్పుడైనా ఒకసారి మాతో ఆడడానికి వచ్చేవాడు. నేను కొబ్బరి దింపు



బొమ్మలు : **చారి పి.యస్.**

కొచ్చినప్పుడల్లా నన్నూ, వీరిగాణ్ణీ రిక్షాలో పాలగుమ్మి తీసుకెళ్ళేవాడు. సైకిలున్నా సరే రాజు రిక్షా ఎక్కడమే సరదాగా ఉండేది.

వాడు కబుర్ల పుట్ట. సినిమాల గురించీ, క్రికెట్ గురించీ ఒకటేమిటి వాడికి తెలియంది లేదు. వాడితో కబుర్లలో పడితే కాలం తెలిసేది కాదు. నేనెప్పుడైనా ఒక వారం కనిపించకపోతే అమలాపురం వచ్చేసేవాడు.

రిక్షావాడితో స్నేహం ఏమిటని మా ఇంట్లో వాళ్ళు కోప్పడేవారు. అయినా నేను పట్టించుకునేవాణ్ణి కాదు. ఆదివారం కానీ, శలవు కానీ వస్తే పాలగుమ్మి తుర్రుమనేవాణ్ణి. రాజుతో కబుర్లలో పడితే కాలం తెలిసేది కాదు.

వాడికి తెలియని విషయం లేదు. సినిమా పాటల గురించి తెగ చెప్పేవాడు. మాకు ఆ వయసులో అర్థం కాకపోయినా పాటల గురించి విడమర్చి చెప్పేవాడు. సినిమా పాటల విషయంలో వాడిది ప్రత్యేకమైన అభిరుచి.

ముఖ్యంగా ప్రతీ నెలా రిక్షా వెనుక ఒక సినిమా పాటలోని పల్లవి మొదటి లైనో, లేదంటే ఒక మంచి వాక్యమో రాయించేవాడు. అవి నాకు బాగా నచ్చేవి. 'సడి సేయకో గాలి సడి సేయబోకే!' అని ఒకసారి, 'ఏటిలోని కెరటాలు ఏరు విడిచి పోవు- ఎద లోపలి మమకారం ఎక్కడికీ పోదు!' అని ఇంకోసారి ఇలా ప్రతీ నెలా అంబాజీపేట ఆర్టిస్టు దగ్గర రాయించేవాడు.

రాజు రాసిన ట్యాగ్‌లైన్ బావుంటుందని ఒకసారి అంటే అలా ఇంగ్లీషు పేరు వద్దనీ, దాన్ని 'పదం' అనమనీ గట్టిగా కొట్టి మరీ చెప్పాడు.

వచ్చే నెల కొత్తది ఏం రాస్తాడో అన్నట్టుగా ఎదురుచూసేవాణ్ణి. రాయించడమే కాదు, వాటి గురించి మాకు వివరంగా చెప్పేవాడు. వచ్చే నెల ఏం రాస్తానో నన్నూ, వీరిగాణ్ణి కనుక్కోమనేవాడు. ఓ చిన్న క్లూ కూడా ఇచ్చేవాడు. ఓసారి మనసు గురించి రాస్తానన్నాడు.

'మనసు గతి ఇంతే, మనిషి బ్రతుకింతే' రాస్తాడని నేను అంటే, 'మనసా కవ్వించకే నన్నిలా' రాస్తాడని వీరిగాడు పందెం కాసాడు. రాజు మాత్రం మమ్మల్ని నెగ్గనిచ్చేవాడు కాదు. ఒకసారి సినిమా పాటలు వదిలేసి 'నా అక్షరాలు వెన్నెల్లో ఆడుకునే అందమైన పిల్లలు' అని రాసాడు. నాకూ, వీరిగాడికీ సినిమా నాలెడ్జి బాగానే ఉంది కాబట్టి సినిమా పాట రాయకుండా మమ్మల్ని మోసం చేసాడని ఇద్దరం గట్టిగా దెబ్బలాడాం. మా ఇద్దరిలో ఎవరు ఓడిపోవడమూ తన కిష్టం లేదని, అందుకే ఒక కవితా వాక్యం రాసానని చెప్పాడు. అప్పుడు తెలిసింది వాడు పెద్ద పుస్తకాలు పురుగు అని. మాకు ఎన్నో కథలూ, కొత్త విషయాలూ చెప్పేవాడు.

నేను ఇంటర్ అయ్యాక వైజాగ్ వెళ్ళిపోతున్నప్పుడు వాడి రిక్షాలోనే నన్ను బస్టాండు వరకూ సాగనంపాడు.

ఆ రోజు రిక్షా వెనక నా కోసం ప్రత్యేకంగా రాసిన పదం ఇప్పటికీ మరిచిపో లేదు. 'స్నేహబంధమూ - ఎంత మధురమూ' చదివి నాకు కళ్ళ నీళ్ళు వచ్చాయి.

ఆ తరువాత వైజాగ్‌లో ఉండగా వీరిగాడు తరచూ ఉత్తరాలు రాస్తూ ఉండేవాడు. రాసినప్పుడల్లా రాజు ఆ నెల రిక్షా వెనకాల కొత్తది ఏం రాసాడన్నదే మొదటి వాక్యంగా ఉండేది. అలా రెండేళ్ళ పాటు రాసినవన్నీ డైరీలో రాసుకున్నాను. ఆ డైరీ ఎప్పుడు ఎక్కడ పోయిందో తెలీదు.

నేను వైజాగ్ వెళ్ళిన కొత్తలో 'ఆనాటి చెలిమి ఒక కల' అని అతను రాసిన ఉత్తరం మాత్రం దాచుకున్నాను. నేను చివరిసారి విన్న రాజు పదం- 'ఆనాటి వాన చినుకులు'. రాజు ద్వారా ఎన్నో మంచి మంచి పదాలు విన్న నాకు ఈ అసంపూర్తి పదం అర్థం కాలేదు. కలిసినప్పుడు అడగాలని అనుకున్నాను.

చదువయ్యాక ఒకటి రెండుసార్లు అమలాపురం వెళ్ళాను కానీ కలవలేకపోయాను. వీరిగాణ్ణి ఆఖరిసారి కలిసింది నేను అమెరికా వచ్చే ముందు. అదీ వాడు హైద్రాబాద్ పనిమీద వచ్చినప్పుడు కలిసాడు.

రాజు ఇప్పుడెలా ఉన్నాడో? కలిసి ఇరవయ్యేళ్ళు పైమాటే! అమ్మా, నాన్నా పోయాక అమలాపురంతో బంధం తెగిపోయింది. మా అన్నయ్య కాకినాడలో స్థిరపడడంతో మరలా అమలాపురం వెళ్ళే అవకాశమే రాలేదు. రెండేళ్ళకోసారి అమెరికా నుండి వెళ్ళినా అమలాపురం మాత్రం వెళ్ళడం పడలేదు. వీరిగాడు అమలాపురంలో బట్టలకొట్టు పెట్టాడని విన్నాను.

"డాడ్!" అంటూ మా చిన్నాడు ఒక్కసారి కుదపడంతో ఈ లోకంలోకి వచ్చిపడ్డాను.



అనుకోకుండా రెండు వారాల తరువాత ఆఫీసు పని మీద ఇండియా ప్రయాణం పడింది. ఈసారి ఎలాగైనా రాజునీ, వీరిగాణ్ణి కలవాలని నిశ్చయించుకున్నాను. బెంగుళూరులో వారం రోజులు ఉండాల్సి ఉంది. ఆ పని అవగానే వెళదామనుకున్నాను.

ఈలోగా వీరిగాడి ఫోన్ నంబరూ అవీ కనుక్కోమని కాకినాడలో ఉన్న మా అన్నయ్య కొడుక్కి పురమాయించాను. వాడు అలాగేనన్నాడు కానీ కనుక్కున్నాడో లేదో చెప్పలేదు. ముందు కాకినాడ వెళ్ళి మా వాళ్ళని చూసి అక్కడ నుండి కార్లో వెళ్ళొచ్చని అనుకున్నాను.

అమలాపురం వెళ్ళాలి అంటే ఎందుకన్నట్లు చూసారు మా వాళ్ళందరూ. నిజం చెప్పద్దూ! మా అన్నయ్య వాళ్ళింటికి వెళ్ళే పదేళ్ళు దాటింది. అన్నయ్య పోయాక అసలు అటువైపుగా వెళ్ళనే లేదు.

భోజనాలు చేస్తుండగా అన్నయ్య కొడుకు- "బాబయ్యా! మొన్న ఇంట్లో సామాను సర్దుతుంటే నీ పెట్టె ఒకటి దొరికింది. దాన్నిండా పుస్తకాలు ఉన్నాయి. ముఖ్యంగా చాలా ఉత్తరాలు ఉన్నాయి" అన్నాడు.

ఉత్తరాలు అనగానే ఒక్కసారి ప్రాణం లేచి వచ్చింది. భోజనాలయ్యాక అటక మీద నుండి పెట్టె దింపించాడు మావాడు. దుమ్మంతా దులిపాక, ఒక్కొక్కటే బయటికి తీసి చూసాను. కాలేజీలో ఉండగా వీరిగాడు నాకు రాసిన ఉత్తరాలు, రాజు నాకిచ్చిన పుస్తకాలూ ఉన్నాయి. అలాగే మా చిన్నప్పటి ఫోటోలూ కనిపించాయి. వీరిగాడి ఉత్తరాలు అన్నీ విప్పి చదవడం మొదలుపెట్టాను. భలే నవ్వొచ్చింది.

ప్రతీ ఉత్తరంలో రాజు రిక్షా వెనుక రాసిన పదం కచ్చితంగా ఉంది. 'భలే మంచి రోజు - పసందైన రోజు', 'ఎవరికెవరు ఈ లోకంలో ఎవరికి ఎరుక?', 'ఎదగడానికెందుకురా తొందరా?', 'మల్లెపందరి నీడలోనా జాబిల్లీ', 'నిదురించే తోటలోకి పాట ఒకటి వచ్చింది' ఇలా పాతిక పైగా పదాలు ఉన్నాయి ఆ

**రాజుతో కబుర్లలో పడితే కాలం తెలిసేది కాదు. వాడికి తెలియని విషయం లేదు. సినిమా పాటల గురించి తెగ చెప్పేవాడు. మాకు ఆ వయసులో అర్థం కాకపోయినా పాటల గురించి విడమర్చి చెప్పేవాడు. సినిమా పాటల విషయంలో వాడిది ప్రత్యేకమైన అభిరుచి. ముఖ్యంగా ప్రతీ నెలా రిక్షా వెనుక ఒక సినిమా పాటలోని పల్లవి మొదటి లైనో, లేదంటే ఒక మంచి వాక్యమో రాయించేవాడు. అవి నాకు బాగా నచ్చేవి. 'సడి సేయకో గాలి సడి సేయబోకే!' అని ఒకసారి, 'ఏటిలోని కెరటాలు ఏరు విడిచి పోవు- ఎద లోపలి మమకారం ఎక్కడికీ పోదు!' అని ఇంకోసారి ఇలా ప్రతీ నెలా అంబాజీపేట ఆర్టిస్టు దగ్గర రాయించేవాడు.**

ఉత్తరాల్లో.

ఆఖరున రాసిన ఉత్తరంలో ఉంది 'ఆనాటి వాన చినుకులు' అన్న పదం. ఒకటికి రెండుసార్లు చదివినా దాని అర్థం ఏమిటో తెలియలేదు. ఆ మర్నాడు ఉదయమే మా అన్న కొడుకుతో కలిసి అమలాపురం కారులో బయల్దేరాను. మా అన్న కొడుకు వీరిగాడి గురించి వాకబు చేసి బట్టలకొట్టు పేరు తెలుసుకుని, ముస్లిం వీధిలో ఉందని చెప్పాడు. చాలా ఏళ్ళ తరువాత వెళ్ళానేమో ఆ ఊళ్ళన్నీ చూస్తుంటే కళ్ళ నీళ్ళు వచ్చాయి. పచ్చని పొలాల మధ్య పాపిటలా నల్లటి తారురోడ్డు ఎంతో అందంగా అనిపించింది. నా చిన్నప్పటి సంగతులన్నీ ఒకదాని వెంబడి ఇంకొకటి ఉప్పెనలా తరుముకొచ్చాయి. మనసంతా బరువెక్కింది.

అమలాపురం వెళ్ళగానే వీరిగాడి బట్టల షాపు కోసం వెతికాం. వీరిగాడు ఇంకా రాలేదు కాని ఎవరో గుమాస్తా ఉన్నాడు. నా గురించి వివరాలు చెబితే వెంటనే వీరిగాడికి ఫోన్ చేసి చెప్పాడు. ఫోన్ తీసుకోగానే "ఒరేయ్! విస్సూ!" అంటూ గట్టిగా అరిచాడు. వెంటనే బయల్దేరి వస్తున్నాననీ ఒక్క అరగంటలో అక్కడ ఉంటాననీ చెప్పాడు. వాడు మొసలపల్లిలోనే ఉంటున్నాడనీ, రోజూ కార్లో వస్తాడనీ గుమాస్తా చెప్పాడు.

వాడు వచ్చే వరకూ అక్కడే కూర్చున్నాను. వస్తూనే వాడి తరహాలో కౌగిలింతలూ అరుపులూ పెట్టాడు. వీరిగాడికి ఒళ్ళు బాగా వచ్చింది. పొట్ట కూడా పెరిగింది, వాడి సంపదకి చిహ్నంగా.

అదే మాటంటే- "నువ్వు మాత్రం భలే టిప్ టాప్‌గా ఉన్నావురా! అవునూ... అమెరికా నుండి వస్తూ బాటిల్స్ అవీ ఏం లేవా మాకు?" అంటూ నిలదీసాడు. నేను మందు కొట్టనని చెబితే- "నువ్వు వెళ్ళింది అమెరికానా? అంతర్వేదా?" అంటూ వెటకారం చేసాడు.

రాజు గురించి అడిగాను. రాజు కూడా మొసలపల్లిలోనే ఉన్నాడనీ, కొంతకాలం ఆటో నడిపి ఈ మధ్య ఆరోగ్యం బాగోలేక మానేసాడనీ చెప్పాడు. వీరిగాడికి ఇద్దరు ఆడపిల్లలనీ, రాజు పెళ్ళి చేసుకోలేదనీ, తల్లితో ఉంటున్నాడనీ చెప్పాడు.

"ఆ మధ్య మైల్డ్‌గా హార్ట్ ఎటాక్ వచ్చింది. తరువాత మనిషి బాగా తీసేసాడు. నువ్వు వచ్చావని చెప్పగానే నిన్ను చూడాలని ఉంది, తీసుకు రమ్మని మరీ మరీ చెప్పాడు..." అన్నాడు.

నాతో తీసుకొచ్చిన ఉత్తరాలూ, ఫోటోలూ వీరిగాడికి చూపించగానే వాడు అన్నీ ఆదుర్దాగా తీసి చదివాడు. చదువుతూంటే వాడి కళ్ళ వెంట నీళ్ళు కారడం గమనించాను.

మనిషికి జ్ఞాపకాలకు మించినవి ఏముంటాయి?

వెలికి తీయాలే కానీ అవి కళ్ళలోంచి ప్రవహించవూ?

•••

కొంతసేపు పిచ్చా పాటీ మాట్లాడుకున్నాక రాజుని కలవడానికి వెళదామని అన్నాను.

తనకి అర్జంటు పని ఉందనీ, ఒకాయన గంటలో వస్తాడని, ఈలోగా నన్ను మొసలపల్లి వెళ్ళి రాజుని కలవమని చెప్పాడు. భోజనం వేళకి వస్తానని, వాడింట్లోనే ఆ మధ్యాహ్నం భోజనం అనీ చెప్పాడు.

నాకూ రాజుని ఒంటరిగానే కలవాలని ఉంది. వీరిగాడితో ఉంటే రాజుని ఎక్కువ మాట్లాడనివ్వడు. పైగా వాడికి సాహిత్యం అవీ పట్టవు. నాకూ రాజుకీ ఉన్న అనుబంధం సాహిత్యమే!

చదివిన ప్రతీ పుస్తకం గురించీ చెప్పేవాడు రాజు నాకు. మా నాన్న తరచూ విజయవాడ వెళ్ళేవాడు. ఆయన విజయవాడ వెళ్ళినప్పుడల్లా పుస్తకాలు తెప్పించుకునేవాడు. రాజు నికార్సయిన మనిషి. లెక్క కట్టి మరీ పుస్తకాల ఖర్చు ఇచ్చేసేవాడు.

రిక్షా సంపాదనంతా పుస్తకాలకి తగలేస్తున్నాడని వాళ్ళ నాన్న తిట్టడం నాకు తెలుసు. అయినా పట్టించుకునే వాడు కాదు. వాడికి చదవడం, సినిమాలు చూడ్డం ఇవే ఇష్టం. వయసులో మా ఇద్దరికీ పదేళ్ళ తేడా ఉన్నా అలా అనిపించేది కాదు. ఆత్మీయతకీ, స్నేహానికీ వయసు భేదం ఉండదు.

చూసి చాలా ఏళ్ళయ్యిందేమో ఊరు పూర్తిగా మారిపోయినట్లనిపించింది. నేను చిన్నప్పుడు తిరిగిన వీధులేనా? అనిపించింది.

కాలువగట్టు మీదుగా మొసలపల్లి వెళ్ళాను. పచ్చని పొలాలు ఎంతో అందంగా కనిపించాయి. ఆకుపచ్చ తివాచీ పరిచినట్లుగా ఉన్నాయి చేలు. కొబ్బరి పింఛాలతో స్వాగతం పలుకుతున్నట్టుగా కనిపించాయి కొబ్బరిచెట్లు. ఈసారి పిల్లల్ని తీసుకొచ్చి వాళ్ళకి ఇదంతా చూపించాలి.



ఓ అరగంటలో అక్కడికి చేరాం. కారు ఆగగానే రాజు లోపల్నుండి పరిగెత్తుకుని వచ్చాడు. డోరు తీసి గభాల్న వెళ్ళి కౌగలించుకున్నాను. మనిషి బాగా చిక్కాడు. జుట్టు బాగా పల్చబడింది. వేషధారణ మాత్రం మారలేదు. తెల్లటి ఇస్త్రీ బట్టల్లో పీక్కుపోయి ఉన్నట్లు కనిపించాడు. నన్ను చూడగానే అతని కళ్ళు చమర్చడం గుర్తించాను. నా పరిస్థితీ అదే!

లోపలికి వెళ్ళి సోఫాలో కూర్చున్నాక, మా కబుర్ల కెరటాలు ఉవ్వెత్తున లేచాయి. ఒకటా, రెండా ఏళ్ళ సంగతులు! పాతికేళ్ళ కబుర్లు... ఒక దాంట్లోంచి ఇంకొకటి.

నేను రాజు రిక్షాని మరిచిపోలేదనీ, తను రిక్షా వెనుక రాసిన పదాలన్నీ గుర్తున్నాయనీ ఒక్కొక్కటీ చెబుతూంటే పగలబడి నవ్వాడు. కాకినాడ నుండి వీరిగాడు రాసిన ఉత్తరాలు చూపిస్తే ఒక్క ఉదుటున లాక్కొని చదివాడు. రిక్షా తొక్కే ఓపిక పోయిందనీ, ఆ తర్వాత ఆటో నడిపేవాణ్ణనీ చెపుతూ బయటున్న ఆటో చూపించాడు. గబుక్కున లేచి బయటికెళ్ళి ఆటో వెనుక ఏం రాసి ఉందా అని చూసాను. 'నానాటి బ్రతుకూ నాటకమూ!' అని ఉంది.

"ఏం రాస్తావో ఎందుకు రాస్తావో

తెలీదు. నీ సొంతం కాకపోయినా రాసింది మాత్రం గునపంలా గుచ్చుకుంటుంది. నువ్వు సినిమాల్లోకి వెళితే బావుండేది" అన్నాను. నవ్వుతూ నా భుజం తట్టాడు.

వెంటనే వీరిగాడు రాసిన ఆఖరి ఉత్తరంలో అసంపూర్తి పదం 'ఆనాటి వాన చినుకులు' గుర్తొచ్చి, ఆ ఉత్తరం తీసి చూపిస్తూ- "అన్నీ అర్థమయ్యాయి కానీ, ఇది మాత్రం అర్థం కాలేదు రాజూ!" అన్నాను.

కళ్ళజోడు తీసి పెట్టుకుని చదివాడు. "ఓ అదా! అదొక అసంపూర్తి కల" అని గట్టిగా నిట్టూర్చాడు. ఎందుకో తెలీదు అతని కళ్ళల్లోంచి ధారాపాతంగా కన్నీళ్ళు వచ్చాయి. వెంటనే సోఫాలో కూలబడ్డాడు. సారీ చెబుతూ పక్కగా కూర్చున్నాను.

"సారీ ఎందుకురా! నా జీవితంలో అదొక చెరగని నల్ల మచ్చ! నువ్వు అడిగావు కాబట్టి చెబుతాను. మా వీరిగాడిక్కూడా తెలీదు..." అంటూ చెప్పడం మొదలుపెట్టాడు.

"నువ్వు వైజాగ్ వెళ్ళిన ఏడాది. పాలగుమ్మిలో మా చుట్టం ఒకాయన నరసిమ్మ అని రైతు ఉండేవాడు. ఓసారి వాళ్ళింట్లో ఒక అందమైన అమ్మాయి కనిపించింది. ఆరా తీస్తే ఆయన మరదలు అని తెలిసింది. వాళ్ళది రావులపాలెం అనీ, బావగారింటికి వచ్చిందనీ తెలిసింది. నేను ఆ అమ్మాయిపై మనసు పడ్డాను. పరిచయం చేసుకున్నాను. సమయం చూసి వాళ్ళ బావని అడుగుదామనుకుంటుండగా, ఆ అమ్మాయిని నరసిమ్మ సవతి తమ్ముడికి ఇద్దామని నిశ్చయించారని తెలిసింది. ఆ అమ్మాయికి నేనంటే ఇష్టమని తెలుసు కాని పెద్దవాళ్ళకి ఎదురుచెప్పే మనస్తత్వం లేదు. కళ్ళముందే ఆ అమ్మాయి పెళ్ళి జరిగిపోయింది. అంతకుముందు కాలుగాలిన పిల్లిలా పాలగుమ్మి చుట్టూ తిరిగిన నేను ఇక అటు వెళ్ళడం మానేసాను. ఆమెను మర్చిపోవడానికి కొన్ని నెలలు పట్టింది. ఒకసారి జగ్గన్నతోట తీర్థంలో చూసాను ఆమెని. కడుపు ఎత్తుగా కనిపించింది. విషయం అర్థమయ్యింది.

ఓ రోజు హోరున వాన పడుతోంది. రాత్రి ఎనిమిదింటికి ఎవరో తలుపులు దబదబా బాదారు. ఎవరా అని వెళ్ళి చూస్తే ఆ అమ్మాయి భర్త. ఆమెకి నొప్పులు వస్తున్నాయనీ, అర్జంటుగా తీసుకెళ్ళాలనీ అన్నాడు. సరేనని బయల్దేరాను. దారి పొడుగునా ఎడతెరిపి లేకుండా ఒకటే వాన. ఆమె నొప్పులతో అరుస్తోంది. అతను పక్కనే కూర్చున్నాడు. కొంచెం దూరం వెళ్ళాక దగ్గర్లో తన స్నేహితుడున్నాడని, అతనికి కారు ఉందని, అడిగి వస్తానని నన్ను ఒక పెద్ద రావిచెట్టు దగ్గర ఆపమన్నాడు. ఆపాను. అప్పటికి నొప్పులు కాస్త తగ్గి ఆమె నిద్రలోకి జారుకుంది. అతను ఇంకా రాలేదు. అంతవరకూ లేని ఆలోచన ఒకటి ఆ క్షణంలో నాలో ప్రవేశించింది. ఒక్కసారి ఆమెను తాకాలనిపించింది. పరిచయం ఉన్నప్పుడు ఒక్కసారి కూడా ముట్టుకోలేదు. మరలా ఈ అవకాశం రాదు. నాలో తెలీని ఆశ పైకొచ్చింది. ఆమెను దగ్గరగా తీసుకొని ముద్దు పెట్టుకున్నాను. నా ఊపిరి వేడికి ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది. నన్ను చూసి బిత్తరపోయింది. సాచి ఒక్క లెంపకాయ కొట్టింది. ఒళ్ళంతా అదిరి బురదలో పడిపోయాను. ఈలోగా ఆమె పెనిమిటి కారు తీసుకొని వచ్చాడు. కారెక్కుతూ 'రాక్షసుడా' అన్నట్లు చూసింది నావైపు. తట్టుకోలేకపోయాను. నేనెంత దుర్మార్గంగా ప్రవర్తించానో అర్థమయ్యింది. పశువు కంటే హీనంగా ఎందుకలా చేసానో అర్థం కాలేదు. ఆ రాత్రంతా చెట్టుకిందే ఏడుస్తూ గడిపాను. మర్నాడు ఆమెకి అబ్బాయి పుట్టాడని విన్నాను. కాని మూడ్రోజుల తరువాత

ఓ రోజు హోరున వాన పడుతోంది. రాత్రి ఎనిమిదింటికి ఎవరో తలుపులు దబదబా బాదారు. ఎవరా అని వెళ్ళి చూస్తే ఆ అమ్మాయి భర్త. ఆమెకి నొప్పులు వస్తున్నాయనీ, అర్జంటుగా తీసుకెళ్ళాలనీ అన్నాడు. సరేనని బయల్దేరాను. దారి పొడుగునా ఎడతెరిపి లేకుండా ఒకటే వాన. ఆమె నొప్పులతో అరుస్తోంది. అతను పక్కనే కూర్చున్నాడు. కొంచెం దూరం వెళ్ళాక దగ్గర్లో తన స్నేహితుడున్నాడని, అతనికి కారు ఉందని, అడిగి వస్తానని నన్ను ఒక పెద్ద రావిచెట్టు దగ్గర ఆపమన్నాడు. ఆపాను. అప్పటికి నొప్పులు కాస్త తగ్గి ఆమె నిద్రలోకి జారుకుంది. అతను ఇంకా రాలేదు. అంతవరకూ లేని ఆలోచన ఒకటి ఆ క్షణంలో నాలో ప్రవేశించింది.

వాతం కమ్మి ఆమె చనిపోయిందని తెలిసింది. నేను చేసిన తప్పే ఆమె చావుకి కారణమని నాలో నేనే ఏడ్చాను. ఎవరికీ చెప్పలేను. ఆనాటి వాన చినుకులు మాత్రం ఇప్పటికీ నన్ను దహించి వేస్తూనే ఉంటాయి. నా తప్పుకి ప్రాయశ్చిత్తంగా రిక్షా వెనుక రాసిన ఆఖరి పదం..." అతను చెబుతుంటే నాకే కళ్ళ నీళ్ళు వచ్చాయి.

"ఆమె చావుకి నిన్ను కారణంగా ఊహించుకోవడం తప్పు. నువ్వేమీ ఆమెను బలాత్కరించలేదు కదా! మనసులో ఉన్న ఒక చిన్న కోరికతో ఆమెను తాకావు..." అన్నాను.

"అయినా అది ముమ్మాటికీ తప్పే. ఆమె ఏ పరిస్థితిలో ఉంది? అదేమీ చూడకుండా పశువులా... ఆ క్షణం ఎందుకలా ప్రవర్తించానో నాకే తెలీదు. కొన్ని ప్రవర్తనలు తర్కానికి అందవు. ఈ విషయం నాకూ, ఆమెకూ తప్ప ఎవరికీ తెలీదు. మొట్టమొదటిసారి నీకే చెప్పాను. ఇన్నాళ్ళూ ఎవరికీ చెప్పని విషయం నీకే ఎందుకు చెప్పాను? తెలీదు. మనుషులు విచిత్రంగా ఉంటారు... నాలాగ..." అంటూ గట్టిగా ఏడ్చాడు.

రాజు ఎందుకు పెళ్ళి చేసుకోలేదో ఇప్పుడర్థమయ్యింది నాకు. తనకు తానే శిక్ష వేసుకున్నాడు. అదేమీ పెద్ద విషయం కాదు. చిన్న తొందరపాటు. ఎక్కడో పొతుకుపోయిన చిన్న ఆవేశం. రాజు అన్నట్లు- అన్ని ప్రవర్తనలూ తర్కానికి అందవు.

కొంతసేపటికి తేరుకుని బయటికి రమ్మనమని పక్కనే ఉన్న షెడ్డు వైపుగా తీసుకెళ్ళాడు. తలుపు తీసి చూపించాడు. ఒకప్పటి రాజు రిక్షా 'ఆనాటి వాన చినుకుల'కు గుర్తుగా తళతళా మెరుస్తూ అలాగే ఉంది.

•••

వీరిగాడూ, రాజులతో ఆ రాత్రంతా గడిపి మర్నాడు ఉదయం వీడ్కోలు తీసుకుని కాకినాడ వెళ్ళాను. అక్కడ నుండి అమెరికా వచ్చేశాను. వాళ్ళిద్దర్నీ కలవడం ఎంతో సంతోషం కలిగించింది.

అమెరికా తిరిగి వచ్చాక రాజు గురించీ, వీరిగాడి గురించీ మా ఇంట్లో చెప్పాను. నా భార్యకి కొన్ని విషయాలు ముందే తెలుసు. పిల్లలకి మాత్రం అన్నీ పూసగుచ్చినట్టు చెప్పాను, ఒక్క 'ఆనాటి వాన చినుకులు' గురించి తప్ప. వీరిగాడికీ చెప్పలేదు. ఆ విషయం నాలోనే సమాధి చెయ్యదల్చుకున్నాను. కేవలం రాజు మీద గౌరవంతో!

ఆ మర్నాడు ఆఫీసుకి బయల్దేరుతుండగా మా రెండోవాడు ఒక్క నిమిషం ఆగు అని సైగ చేసాడు. కారు వెనక్కి వెళ్ళి బంపర్ స్టిక్కర్ తీద్దామని ప్రయత్నించడం చూసి ఒక్క ఉదుటున వెళ్ళి "వద్దు, తరువాత చూద్దాంలే" అని వాణ్ణి వెనక్కి పంపించేసాను. మా రెండోవాడిది మాటంటే మాటే. అందుకే నెల అవగానే తీసేయబోయాడు. వెళుతూ వెళుతూ ఒక్కసారి వెనక్కి తిరిగి కారు బంపర్ స్టిక్కర్ మీద రాసింది చదివాను.

We travel, some of us forever, to seek places, other lives, other souls!

.................................................

gorthib@yahoo.com

## ఇవీ వచ్చాయి

**అంతా రామమయం**
**రచన :** డా. కంపల్లె రవిచంద్రన్
**పేజీలు :** 120, **వెల :** రూ.120
**ప్రతులకు :** విశాలాంధ్ర, నవోదయ

**ముకుందమాల**
కులశేఖర ఆళ్వారుల కృతికి
**అనుసృజన :** ఓలేటి శ్రీనివాస భాను
**వెల :** రూ. 100

**తేనె చంద్రుడు**
(ఆహ్లాద కథానికలు)
**రచన :** సింహప్రసాద్
**పేజీలు :** 140, వెల : రూ.100

**భలే మంచి చౌక బేరము**
(హాస్య కథానికలు)
**రచన :** సింహప్రసాద్
**పేజీలు :** 128, **వెల :** రూ.100

**కవిత్వంలో నేను**
మరికొన్ని వ్యాసాలు
**రచన :** విన్నకోట రవిశంకర్
**పేజీలు :** 288, **వెల :** రూ.150
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

**హిందూ నాగరికత ప్రాచీనత - వైశిష్ట్యము**
**రచన :** ఇంద్రకంటి వెంకటేశ్వర్లు
**పేజీలు :** 208, **వెల :** రూ.80
**ప్రతులకు :** 94413 73304

**ఒత్తిడి కూడా వరమే!**
**రచన :** డా. బి.వి. పట్టాభిరామ్
**పేజీలు :** 168, **వెల :** రూ.75
**ప్రతులకు :** 040-23264028

**ప్రణయవాహిని**
(ముగ్ధ నాయికలు)
**రచన :** డా. కొండూరు శ్రీదేవి
**పేజీలు :** 244, **వెల :** రూ.150
**ప్రతులకు :** 99632 09974

**చలసాని ప్రసాద్ లేఖలు**
సన్నిధానం నరసింహశర్మకు రాసినవి
**సం. :** మలసాని శ్రీనివాస్
**పేజీలు :** 92, **వెల :** రూ.80
**ప్రతులకు :** 92920 55531

**చెప్పుకుంటే కథలెన్నో**
**రచన :** కామేశ్వరి చెంగల్వల
**పేజీలు :** 168, **వెల :** రూ.120
**ప్రతులకు :** 98493 27469

## కొత్త పుస్తకాలు




తెలుగు సాహిత్యంపై, సాహిత్యకారులపై ఆంగ్ల సాహిత్య ప్రభావం విశేషంగా ఉందనే వాస్తవాన్ని ఎవరూ కాదనలేరు. గురజాడ, కందుకూరితో మొదలై ఇవాళ్టి కొత్తతరం రచయితల దాకా చాలామంది ఆంగ్ల సాహిత్యం నుంచి స్ఫూర్తిపొంది రచనలు చేస్తున్నారు. ప్రభావం సంగతి పక్కన పెడితే ఆంగ్ల సాహిత్యం గురించి లోతుగా తెలుసుకోవాలనే తెలుగు పాఠకులకు ఉన్న వనరులు చాలా పరిమితం. ఆ లోటును తీరుస్తూ షేక్స్‌పియర్, వర్డ్స్ వర్త్, సోమర్ సెట్ మామ్ తదితర ఆంగ్ల సాహిత్యకారుల గురించి ప్రముఖ రచయిత బుచ్చిబాబు రాసిన వివిధ వ్యాసాలను నవచేతన పబ్లిషింగ్ హౌస్ సంకలనంగా వెలువరించింది.

# అద్దంలో ఆంగ్ల సాహిత్యం

షేక్స్‌పియర్ నాలుగు వందల జయంతి సందర్భంగా 1964లో బుచ్చిబాబు భారతి పత్రికకు రాసిన వ్యాసం ఈ సంకలనంలో మొదటిది. ప్రకృతిని, సౌందర్యాన్ని, మానవ స్వభావాన్ని షేక్స్‌పియర్ తన రచనల్లో వివరించిన తీరుని చెప్పారు. తను రచించిన 'చివరకు మిగిలేది' నవలపై హామ్‌లెట్ ప్రభావం గురించి కూడా దాచుకోకుండా ఉదాహరణ సహితంగా వివరించారు. అలాగే షేక్స్‌పియర్ రచనలు సమగ్రంగా తెలుగువారికి అందాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పారు. ఈ సంకలనంలోని మరో ముఖ్యమైన వ్యాసం (వంద పేజీల పైనే) ప్రముఖ తత్వవేత్త బెర్ట్రాండ్ రస్సెల్ గురించి రాసిన వ్యాసం. బెర్ట్రాండ్ జీవిత విశేషాలతో పాటు ఆయన ఆలోచనలు, భావాలను విశ్లేషించారు. రస్సెల్ గురించి తెలుసుకోవాలనుకునే వారు తప్పక చదవాల్సిన వ్యాసం ఇది. అలాగే సోమర్‌సెట్ మామ్, ఆయన కథా ప్రపంచం, టీఎస్ ఇలియట్, ఆల్డస్ హక్స్‌లీ వంటి ఆంగ్ల సాహిత్యకారులు, వారి రచనలతో పాటు జీవిత విశేషాలనూ అందించారు రచయిత. బుచ్చిబాబు దస్తూరితో పాటు, బెర్ట్రాండ్ రస్సెల్ బుచ్చిబాబుకు రాసిన లేఖనూ ఈ సంకలనంలో చేర్చడం పాఠకులకు ఒక బోనస్.

**బుచ్చిబాబు సాహిత్య వ్యాసాలు** రెండో భాగం (ఆంగ్ల రచయితలపై వ్యాసాలు)
**పేజీలు :** 245, **వెల :** రూ. 150, **ప్రతులకు :** నవతెలంగాణ

- చందు




గ్రామీణ వ్యవసాయిక సమాజంలోని ఉమ్మడి కుటుంబంలో మహిళలపై జరిగే అణచివేతను, హింసను దళిత మహిళ కోణంలో ప్రతిభావంతంగా చిత్రించిన నవల 'వొయినం'. జాజుల గౌరి రచించిన ఈ నవల 1970 - 80 మధ్య కాలంలో భాగ్యనగరం పరిసరాల్లోని గ్రామీణ జీవితాన్ని కళ్లకు కడుతుంది. సొంత కాళ్లపై నిలబడాలనుకున్న మొగిలయ్య, నీలమ్మ అనే దళిత దంపతుల జీవితం ఎటువంటి ఆటుపోట్లు, కష్టసుఖాలకు గురయ్యిందో తెలిపే నవల ఇది. కుటుంబ పెద్ద సత్తయ్య దురాశ, కుట్రల, అరాచకాల కారణంగా నీలమ్మ జీవితం అతలాకుతలం అవుతుంది. చిన్న వయసులోనే భర్త చనిపోగా తన పొలాన్ని, బిడ్డలను కాపాడుకునేందుకు అనేక అవమానాలను, హింసను తట్టుకుని నిలబడ్డ నీలమ్మ పాత్ర మనల్ని చాలా కాలం వెంటాడుతుంది. ఐతే ముందుమాటలో ఇది దళిత నవల అని చెప్పినా ఒక్క పెళ్లి సంఘటన మినహాయిస్తే ఎక్కడా దళిత జీవితం ప్రముఖంగా కానరాదు. దళిత సమస్య కన్నా ఉమ్మడి కుటుంబాల్లోని పురుషాధిక్యత, మహిళల అణచివేతే ప్రధానంగా కనిపిస్తుంది.

# మట్టిమనుషుల బతుకు చిత్రం

హైదరాబాద్ నగరం చుట్టుపట్ల గ్రామాలకు చెందిన మాండలీకం ఈ నవలకు ప్రత్యేకతను, కొత్తదనాన్ని ఇచ్చింది. జానపదుల జీవితంలో ప్రధాన భాగమైన పాటను నవలలో భాగంగా చేర్చడం దీని మరో ప్రత్యేకత. పాటలకు, శ్రామికులకు విడదీయరాని సంబంధం ఉంది. అందుకే రచయిత్రి నవలలో పండుగలు, శుభకార్యాలు, జాతరలు వచ్చిన అన్ని సందర్భాలలోనూ పాటలను చేర్చారు. అయితే మొగిలయ్య భూమి కోల్పోయిన బాధలో కూడా పాట పాడటం కొంత అసహజంగా అనిపిస్తుంది.

పుస్తకం నిండా మట్టి పరిమళం వెదజల్లుతూ మాండలికం అద్దిన రచయిత్రి అక్కడక్కడా గ్రాంథికంలో రాయడానికి ప్రయత్నించడం పాఠకులకు ఇబ్బంది కలిగిస్తుంది. అస్తిత్వ వాద స్పృహ, మాండలీకం, సహజత్వం, శైలి .. 'వొయినం' నవలకు ప్రత్యేకతను తెచ్చిపెట్టాయి.

**వొయినం**, జాజుల గౌరి
**పేజీలు :** 200, **ప్రతులకు :** 93910 36987




# జంతువుల ఈడెన్.. జపాన్

**ప్రపంచవ్యాప్తంగా జంతువులకు జూలు ఉండటం మనకు తెలుసు. కానీ జపాన్‌లో జంతువులకు ప్రత్యేకంగా దీవులే ఉన్నాయి. ఒక్కో జాతికీ ఒక్కో దీవి. అయితే పిల్లులకు మాత్రం కొంచెం ఎక్కువగా ఓ డజను దీవులున్నాయి. అదెలా జరిగిందో తెలుసుకోండి మరి.**

### ఎవోషిమా దీవి

జపాన్‌లో ఉన్న పన్నెండు పిల్లుల దీవుల్లో అత్యధిక పిల్లుల జనాభా ఉన్న దీవి ఇది. నిజానికి ఇదొక బెస్తవాళ్ల దీవి. అయితే వాళ్లకంటే అక్కడ పిల్లులే ఎక్కువ ఉంటాయి. అసలు పిల్లులు ఇక్కడకు ఎందుకొచ్చాయంటే... ఎలుకలను చంపడానికి మొదట కొన్ని పిల్లులను తీసుకొచ్చారట స్థానికులు. ఎలుకల సమస్య తీరింది గానీ పిల్లులకు శత్రువులెవరూ లేకపోవడం వల్ల చాలా తక్కువ కాలంలోనే అవి ఈ ద్వీప మానవ జనాభాను మించిపోయాయి. చాలామంది పర్యాటకులు ప్రత్యేకంగా పిల్లులను చూడటం కోసమే ఈ దీవిని సందర్శిస్తుంటారు.

### ఒకిషిమా దీవి

మరో పిల్లుల దీవి ఒకిషిమా. ఈ దీవిలో 350 నివాస గృహాలున్నా ఇక్కడ నివసించే వాళ్లెవరూ ప్రయాణాలకు కార్లు, బైకులు వాడరు. సైకిళ్ల మీదే ప్రయాణమంతా! దీవిలో అటూ ఇటూ తిరిగే పిల్లుల భద్రత కోసమే వాళ్లు కార్లను, బైకులను త్యాగం చేశారు. నారింజలు అత్యధికంగా పండే ముజుకిజిమా దీవిలో పిల్లులు కూడా నారింజ రంగులో ఉంటాయట. హొన్షు దీవిలోనూ మార్జాల సామ్రాజ్యమే ఉంది. పిల్లులకు సహజ శత్రువులు లేకపోవడం, అదే సమయంలో జపనీయులు వాటిని జాగ్రత్తగా సంరక్షించడం వల్ల జపాన్‌లో పిల్లుల సంతతి బాగా వృద్ధి చెందుతోంది. మనం చెప్పుకున్న ఈ 5 దీవులే కాక మరో ఏడెనిమిది దీవుల్లో కూడా పిల్లి జనాభానే ఎక్కువంటే ఇక్కడ వాటి డామినేషన్ ఏ స్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు.

### కుందేళ్ల దీవి

పిల్లులకు మాత్రమేనా... మేం మాత్రం ఏం తీసిపోయాం అని దెబ్బలాడి మరీ కుందేళ్లు ఈ దీవిని వశం చేసుకున్నాయేమో అనిపిస్తుంది ఒకునోషిమా దీవిని చూస్తే! రెండో ప్రపంచ యుద్ధ కాలంలో ఇక్కడ ఓ పాయిజన్ గ్యాస్ ఫ్యాక్టరీని స్థాపించారు. అక్కడ తయారయ్యే రసాయన ఆయుధాల పనితనాన్ని పరీక్షించేందుకు కుందేళ్లను పెద్దఎత్తున పెంచారు. యుద్ధానంతరం ఆ ప్రయోగాలకు గురైన కుందేళ్లను చంపేశారు. కాని ఆ తర్వాత ఈ ఫ్యాక్టరీని మ్యూజియంగా మార్చినపుడు మళ్లీ కుందేళ్లను దీవిలోకి తీసుకొచ్చారు.

దీని గురించి మరో కథ కూడా ప్రచారంలో ఉంది. 1971లో కొంతమంది స్కూలు పిల్లలు ఎనిమిది కుందేళ్లను ఈ దీవిలోకి తీసుకొచ్చారట. కుందేళ్లకు సహజ శత్రువులైన కుక్కలకు, పిల్లులకు ఈ దీవిలో స్థానం లేనందువల్ల ఆ కుందేళ్లు తమ సంతతిని గణనీయంగా పెంచుకుని ఇపుడు వేల సంఖ్యకు చేరుకున్నాయని కొంతమంది వాదిస్తారు. ఎవరి నమ్మకం ఎలా ఉన్నా... ఒకటి మాత్రం నిజం ఒకునోషిమా దీవికి ఆకర్షణ ఈ కుందేళ్లే.

### నక్కల రాజ్యం... జావ్

జపాన్ జానపదాల్లో నక్కల చుట్టూ ఎన్నో కథలున్నాయి. జపనీయులకు నక్కలంటే ప్రత్యేకమైన ప్రేమ కూడా. అందుకే షిరోషి (Shiroishi) పర్వతాలకు దగ్గరలోని జావ్ ఐలాండ్‌ని ఫాక్స్ విలేజీగా తీర్చిదిద్దారు. ఈ దీవిలోకి అడుగుపెడితే... మన వీధి కుక్కల్లా స్వేచ్ఛగా తిరుగు తోన్న నక్కలు కనిపిస్తాయి. టూరిస్టులకు అడ్మిషన్ ఫీజు ఉంటుంది. దాంతో పాటు నక్కలకు ఆహారం పెట్టాలను కుంటే 100 యాన్లు చెల్లించి టోకెన్ తీసుకోవాల్సి ఉంటుంది. ఫాక్స్ విలేజ్ మొదటి భాగంలో నక్కలు బోనుల్లో ఉంటాయి. చూడ్డానికి అదొక జూని తలపిస్తుంది. రెండో భాగమే ప్రధాన భాగం. దీనిలో అనేక చెట్లు, మొక్కలూ ఉంటాయి. ఇక్కడ నక్కలు స్వేచ్ఛగా విహరిస్తుం టాయి. దాదాపు అన్ని రకాల నక్కలను ఇక్కడ చూడొచ్చు. వివిధ రంగుల్లో అవి భలే ముద్దొస్తుంటాయి. అయితే ఇక్కడ ఎవరి పర్యవేక్షణా ఉండదు కాబట్టి పర్యాటకులు కొంచెం నక్కల పట్ల జాగ్రత్త వహిస్తే మంచిది.



### డీర్ పార్క్

వకాకుస పర్వత పాదం దగ్గరి నారా నగరంలో ఉంది జపాన్‌లోని అతి పురాతమైన పార్కుగా చెప్పుకునే డీర్ పార్క్. ఇక్కడ జింకలను పవిత్రమైన జీవులుగా భావిస్తారు. వాటిని చంపడం అంటే రాజ్య ధిక్కార నేరంగా పరిగణించేవారు ఒకప్పుడు. మరణశిక్ష సైతం విధించేవారు. దీని వెనుక ఓ పురాణగాథ ఉంది. కసూగా వంశ రాజులు పూజించే నలుగురు దేవుళ్లల్లో ఒకడైన టకేమికజూచి (Takemikazuchi) మికాసా పర్వతం మీద తెలుపు జింకపై స్వారీ చేస్తూ కనిపించాడట ఒకసారి తన భక్తులకు.



అప్పటినుంచి కసూగా వంశ రాజులు జింకను పవిత్ర జీవిగా భావించేవాళ్లు. రాజ్యాలు పోయి ప్రజా ప్రభుత్వాలు వచ్చినా ఆ అలవాటు పోలేదు. పైగా రెండో ప్రపంచ యుద్ధం తర్వాత జింకను పవిత్రమైన జంతువుగా గుర్తిస్తూ ప్రభుత్వం అధికారిక ఉత్తర్వులు వెలువరించింది. ఆ సందర్భంగానే ఈ జింకల పార్కు ఏర్పాటై పర్యాటకులకు కనువిందు చేస్తున్నది. ఈ మూగజీవాల పట్ల జపాన్ దేశస్తుల ప్రేమ వాళ్లకు పర్యాటకంగా కూడా బాగా కలిసివస్తోంది. ఎందుకంటే ఈ జంతువుల దీవులను చూసేందుకు ఏటా భారీ స్థాయిలో పర్యాటకులు జపాన్ వస్తున్నారు.

